తగ్గుముఖముచేసికొనిరని యీ నిదర్శనము లన్నిటివలనను రూఢియగుచున్నది." అని తాను వ్రాసిన భారత వాఙ్మయచరిత్ర అను గ్రంథమునందు ప్రొ. వెబ్బర్ గారు స్పష్టపరచియున్నారు.

మహమ్మదీయుల పరిపాలనలో ఆయుర్వేదమునకు ప్రభుత్వమువలన నెట్టి సహాయము లభించియుండలేదు. అందువలన మన దేశమునందు పెక్కు భాగములలో ముఖ్యముగా సింధుపరగణాలో ఆయుర్వేదము విలుప్తమై పోయినది. కాని బ్రిటీషువారు వచ్చినపిమ్మట ఇతర రాష్ట్రములలోని ఆయుర్వేదశాస్త్రవేత్తల పరిచయమువలన సింధుపరగణావారు ఆయుర్వేదమే వినుత సింధుపరగణాలో వాడుకలోనుండెనని తెలిసికొనగలిగిరి. మహమ్మదీయుల పరిపాలనలో యునానీ విధానమునకు ప్రాముఖ్యత కలిగినట్లు బ్రిటీషువారిపరిపాలనలో అల్లోపతి విధానమునకు ప్రాముఖ్యము కలిగినది. అందువలన మన దేశమునందిపుడు అల్లోపతివిధానమే అధికముగ వ్యాప్తి చెందియున్నది. ఆయుర్వేదాభివృద్ధికి ప్రధానసాధనము లగు ఆయుర్వేద పాఠశాలలు, ఔషధాలయములు అనగా వైద్యశాలలు, ఔషధనిర్మాణశాలలు, మున్నగునవి మన దేశమందు చాల తగ్గిపోయియున్నవి. సింధు పరగణాయందు లేనేలేవని కూడ చెప్పవచ్చును. కావున దీనిని అభివృద్ధి నొందించుటకు తగిన సాధనము గూర్చియే మీ రిపుడు యీ సభలో ముఖ్యముగా ఆలోచింపవలసియున్నది. ఈ సంకల్పముతో శ్రీ వైద్యరాజ శంకరదాస్ శాస్త్రిగారు అఖిలభారత ఆయుర్వేదమహాసభను ఏర్పాటు చేసియున్నారు. ఆ మహాశయుడు 20 సంవత్సరములక్రితము ఈ మహాసభను ఏర్పాటు చేసినప్పటి నుండియు యీ విధానము ఎటుల దినదినాభివృద్ధి నొందుచున్నదియును వార్షికసభలకు ఒక వత్సరముకంటె ఒకవత్సరము ఎటుల హెచ్చుమంది వచ్చుచుండుటయును మీ కనుభవైకవేద్యమే. సింధుపరగణాయందు మాత్రము సరియైన అభివృద్ధి కలుగలేదు. హైదరాబాదు, షక్కర్, శికార్పూర్, సక్కూర్ మున్నగు పెద్దపట్టణములలో ఒక్కొక్క ఉచితవైద్యశాల మాత్రమే కలదు. వైద్యుల సంఖ్యకూడ మిక్కిలి తక్కువగనే యున్నది. కరాచిలో సూరుధర్మవైద్యశాలలును 25, 30 మంది వైద్యులును కలరు. కరాచిలోని వైద్యులు ఏకసంఘముగా నేర్పడి మొదలు వారధికోత్సాహముతో ప్రచారముచేయసాగిరి. అప్పటినుండియు మంచి అభివృద్ధి కనబడుచున్నది. ఈ సంఘము 1924 లో వైద్యమహాసభకు అనుబంధముగా చేర్చబడెను. 1925 లో పాఠశాల యేర్పరుపబడెను, దానిలో చాలమంది విద్యనభ్యసించి కృతార్థులైరి. మరిపెక్కుమంది యిపుడు విద్య నభ్యసించుచున్నారు. పండిత సుక్రామదాస్, టి. ఓఝూగారి ధర్మాయుర్వేద వైద్యశాలలో వైద్యసాహాయ్యము ప్రజలకు మిక్కిలి బాగుగా లభించుచున్నందున కరాచీ మ్యునిసిపాలిటీవారు యీ వైద్యశాలకు వార్షికమును ఏర్పాటుచేసిరి. శ్రీ ఓమహాసభ యీ పట్టణమున జరిగినందులకు స్మారకచిహ్నములుగా మరిరెండు ధర్మాయుర్వేద వైద్యశాలలనుకూడ నిచట ఏర్పాటుచేయుటకు నిర్ణయించియున్నారు. మీరు చాల శ్రమపడ్డప్పుడుకొని యీ పట్టణమునకు దయచేసినందుకు మీకు వందనము లర్పించుచున్నాను. సుపరిచితమందు ఇతర రాష్ట్రములలో ఆయుర్వేదము వృద్ధిపొందుచున్నటుల సింధుదేశములోకూడ వృద్ధినొందుటకుతగిన ఏర్పాటులుచేయ గోరెదను" అని సన్మానసంఘాధ్యక్షుడు విన్నవించెను.



## అధ్యక్షుని ప్రారంభోపన్యాసము

### సభాధ్యక్షుడు వైద్యరత్న పండిత రామప్రసాదశర్మ గారు, పాటియాలా సంస్థానమున రాజవైద్యుడు

మహర్షులు మన కొసంగిన నిక్షేపములలో ఆయుర్వేద మొకటియై యున్నది. ఇప్పటికైన నేనీ శాస్త్రమున పారంగతుడనని చెప్పుకొనుటకు నాకెట్టి అధికారమును లేదు. నాకు గల పరిజ్ఞానము అత్యల్పము. కాని మనుష్యుడు తన జీవితమునందు నిజమైన శాంతిని బొందుటకు తగిన నిర్దిష్టములగు ఆయుర్వేద నియమములను అనుసరించుటయే అని మాత్రము నేను రూఢిగా చెప్పగలను. మనస్సును శరీరమును ఆరోగ్యముగా నుంచినగాని నిజమైన శాంతి కలుగదు. ప్రశంసనీయములగు ఆయుర్వేద నియమములను అనుసరించుటవలన తప్ప ఇతర దేనివలనను శరీరమునకును మనస్సునకును సంపూర్ణ ఆరోగ్యము కలుగజాలదు.

ఆయుర్వేదముకూడ అపౌరుషేయమే అని మహర్షులు తెలిపిరి. పరమేశ్వరునివలెనే వేదములుకూడ నిత్యములు. ఆయుర్వేదముకూడ వేదములలో నొకభాగమే. ప్రతిసృష్టియందు ప్రళయ సమయమున భగవంతుడు నిత్యములగు నీ వేదములను కాపాడుచుండును. ప్రళయావసానమున మరల వానిని వెల్లడించుచుండును. అని ఆత్రేయుడు వివరించెను. చరకాచార్యుడు గూడ నిటులనే వచించెను.

ఆయుర్వేదము అథర్వవేదమునం దొకభాగమని సుశ్రుతాచార్యుడు వ్రాసెను. సృష్ట్యాదిని బ్రహ్మ లక్షశ్లోకములు గల ఆయుర్వేదమును రచించెను. దానిని వేయి ప్రకరణములుగా విభజించెను. అదియే ఆయుర్వేదసంహిత అను ఆదిమగ్రంథము- అని సుశ్రుతాచార్యుడు వ్రాసెను. ఈ శాస్త్రము అనాదియే యనియు దానినే బ్రహ్మ గ్రంథరూపమున వెల్లడించెననియు మాత్రమే యిందువలన తెలియుచున్నది.

వేదములలో ఆయుర్వేద మంత్రము లెన్నియో కలవు. వానిలో ఆయుర్వేద ఓషధుల మహిమ వర్ణింపబడియున్నది.

ఓ జనులారా, మరుత్తులారా, మీ యొద్దనున్న పవిత్రమగు ఔషధములలో మాతండ్రి యగు మనువు ఎన్నుకొనిన ఆరోగ్యప్రదములను శ్రేష్ఠములను వానిని మా సౌఖ్యముకొరకును లాభముకొరకును రుద్రునివలన నేను బడయగోరుచున్నాను. ఋగ్వేదము II 33, XII.

సోమరససంపన్నములును వాజీకర-పటిష్ఠములును పుష్టి నిచ్చుటలోను శక్తినొసంగుటలోను శ్రేష్ఠములును అగు వనమూలికలను నేనిందు చేర్చి దీనిని సమగ్రము గావించితిని. ఋగ్వేదము X. 8, 97.

ఋగ్వేదములో సోమపతి అశ్వపతి ఉష్ట్రయంతి ఉదోజస అను విభాగములుండెను. వానినే యితరుల గ్రంథములలో రసాయన వాజీకరణ ఆయువృద్ధివిద్య అను పేర్లతో వ్రాసిరి. వ్యాధిని మృత్యువును నిరోధించుటకు ఈ నాలుగువిధములను మనుష్యునకు సహాయము చేయును.

విజయసంపన్నులగు నోషధులారా మీయందున్న జయప్రదమగు శక్తిని బలమును సామర్థ్యమును యీ మనుష్యుని యక్ష్మవ్యాధినుండి తొలగింపజేయగలవు. కావున ఓ వనస్పతులారా, నేనీ ఔషధమును సిద్ధపరచితిని. అథర్వవేదము 8, 7, 5.

ఈ వాక్యమునందలి యక్ష్మశబ్దము శరీరమునందలి దోషముల కన్నిటికినికూడ వర్తించును. క్షయ మున్నగు అన్ని వ్యాధులకును యీ నామమే వర్తించును. "రోగము, ఆటంకము, యక్ష్మ, దోషప్రకృతి, వికార అనునవికూడ దోషములకు పర్యాయపదములే. వ్యాధులు కూడ నివియే." అని చరకాచార్యుడు వ్రాసెను.

ఈరీతిగా ఆయుర్వేదనియమము లన్నియును వేదములోనే మంత్రాత్మకములుగా నున్నవి. ఇవి దర్శనములలోను శాస్త్రములలోను కూడ చేర్పబడియున్నవి. గౌతముడు న్యాయసూత్రములలో ఆయుర్వేదవాక్యములనే ప్రమాణములుగా నుదాహరించియున్నాడు.

ఆయుర్వేదము యొక్క అవకాశము అతివిశాలము. శరీరమునకును జీవునకును గల సంబంధమే జీవనము. జీవనమునకును కాలమునకును గల సంబంధమే ఆయువు. ఈ ఆయువును సాకల్యముగా బోధించు శాస్త్రమే ఆయుర్వేదము. ఇది మానవజాతికంతటికిని కూడ సంబంధించిన గొప్పశాస్త్రము. రోగులకును ఆరోగ్యవంతులకును కూడ నిది యుపయుక్తమే.

సత్యయుగమునందు మహర్షులు సత్యవ్రతులును ఉదారస్వభావులునై యుండిరి. అందువలన ఆయుగములోనివారు సంపూర్ణారోగ్యముతో దీర్ఘకాలము జీవింపగలిగిరి. వారికి మేధాశక్తియును జ్ఞాపకశక్తియును అత్యధికముగ నుండెను. వారి జ్ఞానముకూడ మిక్కిలి హెచ్చుగానుండెను. తదనంతరము మానవుల శారీరకశక్తులు క్రమముగా క్షీణింపసాగెను. దానిని ఋషులు గ్రహించి ప్రజలను కాపాడుటకు తగినశాస్త్రములను వెల్లడింపసాగిరి. అటుల చేసినవారిలో మొదటివాడు కపిలుడు. ఆతడు సాంఖ్యశాస్త్రమును వ్రాసెను. ప్రకృతికిని పురుషునకును గల సంబంధముగూర్చియు ! ప్రకృతిపరిణామముగూర్చియు ఆతడాశాస్త్రమున వివరించెను.

పిమ్మట కణాదుడు వైశేషికశాస్త్రమునందు పంచభూతములగూర్చియు వానికి గల విభేదములగూర్చియు సంబంధమునుగూర్చియు, మానవుని మనసునకును జీవునకును, పంచభూతములతో సంబంధములగూర్చియు వివరించెను.

పిమ్మట గౌతముడు న్యాయశాస్త్రమును రచించెను. పూర్వకర్మవలననే పునర్జన్మములు కష్టసుఖములు కలుగుచుండునని యాతడు బోధించెను.

అనంతరము పతంజలి యోగశాస్త్రమును వ్రాసెను. ఇందు అనేకవిధ అష్టసిద్ధులను బడయుటకును అద్వైతసిద్ధిని బొందుటకును తగిన యోగసాధనములు నిరూపింపబడినవి. ఈ యోగశాస్త్రమునందే యీశ్వరప్రణిధానవాదము అను నొకభాగము కలదు. ఇందు ధ్యానలక్ష్యమును సులభముగా నిర్ణయించుకొని మనస్సును జయించి శాంతిని బడయుటకు విధానము తెలుపబడెను.

అనంతరము జైమిని మీమాంసశాస్త్రమును వ్రాసెను. భగవన్మూర్తియందు మనస్సును లగ్నము చేయుపద్ధతియును మానవులు నావిధానమున లౌకికములగు కొన్నికర్మలను చేయు పద్ధతియును ఇందు వివరింపబడెను.

అటుపిమ్మట వేదవ్యాసులవారు వేదాంతశాస్త్రమును వ్రాసిరి. బ్రహ్మస్వరూప మిందు చక్కగా వివరింపబడెను. దానిని సరిగా గ్రహించినవేగాని మోక్షము లభింపదని అందు స్పష్టముగా తెలుపబడెను.

ఈశాస్త్రములలో వివరింపబడినరీతిని మోక్షసాధన మొనరించుటకు శరీరము ఆరోగ్యస్థితియందుండవలెనేగాని వీలులేదని ఋషులు గ్రహించి యందువలన ఆయుర్వేదము నభ్యసించి ప్రపంచమునందు వ్యాపింపజేసిరి. ఆయుర్వేదనియమములను సరిగా ననుసరించననేగాని శరీరమును మనసును ఆరోగ్యస్థితిలో నుండవు. ఉండనిచో మోక్షసాధనము చేయుట కవకాశముండదు. లేనిచో ముక్తి లభించదు.

మనదేశములలో నన్ని సారమంతయును ఆయుర్వేదమునం దిమిడియే యున్నది. ఒకప్రాణికి బాధకలిగించున వన్నియును వ్యాధు లనబడును.

(1) వ్యాధులలో శారీరకములు, (2) సంప్రాప్తములు లేక ఆకస్మికములు (3) మానసికములు (4) స్వాభావికములు, అను నాల్గు భాగములు కలవు.

అనుచితమగు ఆహారములు తినుటవలన కఫవాత పిత్తములు వ్యత్యస్తమగుటచే కలిగెడువ్యాధులన్నియును శారీరకములనబడును. వెఱ్ఱికుక్క కరచుట తేలుకుట్టుట, పాముకరచుట, బాణముతగులుట, క్రిందపడుట [illegible] దెబ్బతగులుట, విషవాయుస్పర్శగలుగుట మున్నగు బాహ్యకారణములవలన కలుగు వ్యాధులు సంప్రాప్తములు లేక ఆకస్మికము లనబడును.

రాజస, తామసగుణములు ప్రబలుటవలననే కలిగెడు తీవ్ర సంభోగవాంఛ, కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము, భయము, దురాశ, మున్నగునవన్నియు మానసిక వ్యాధులు.

జననము, మరణము మున్నగునవి స్వాభావికవ్యాధులు. వీని నన్నిటిని తొలగించుకొనుటకు ఆయుర్వేదము లోకమునకు ప్రసాదింపబడెను. [illegible] చేరిన జననమరణాదులకు స్వాభావిక వ్యాధులగూర్చి మాత్రమే బోధించెను. ఆయుర్వేదములో గల విషయములే వానిలో గూడ నున్నవి.

తన ఆత్మను విశ్వములోను, విశ్వమును తన ఆత్మలోను చూడగలవాడును, బ్రహ్మమునకును ప్రకృతికిని గల భేదమును గ్రహింపగలిగినవాడును యథార్థజ్ఞానమువలన ఆత్మశాంతిని బడయగలవాడును ఎన్నటికిని కష్టపడడు.

దేశకాలవిచ్ఛేదము లేకుండ సర్వకాలములందును సర్వప్రాణులను సర్వవిధముల సమానములే అని గ్రహింపగలిగినవాడే బ్రహ్మమును పొందినవాడగును. అట్టివానికి పునర్జన్మ కలుగదు. అందువలన అతడు ముక్తుడగును.

విపాపం, విరజస్, శాంతం, పరం, అక్షరం, అవ్యయం, అమృతం, బ్రహ్మ, నిర్వాణం అను శబ్దములన్నియును ఆత్మశాంతినే వెల్లడించును. ([illegible])

మానసికవ్యాధులగు కామక్రోధాదులు కలుగగానే శరీరమునందు స్వార్థపరత్వము అధికమై ఉత్తమ విషయములను నిర్మూలింపజేయును. వర్తమానమందు గల యీ ముఖ్యవిషయము సరిగా గ్రహింపలేని కారణమున గొప్ప సంస్కృతపండితులనువారు పెక్కుమందికూడ గర్వము, ద్వేషము, మున్నగు దుర్గుణములను కలిగియుండుట తటస్థించుచున్నది. కావున ఆయుర్వేద మహాశాస్త్రమును పునరుద్ధరింప బూనినవారెవ్వరును యిట్టి దుర్గుణములకు వశులుగాకుండుదురు గాక యని నేను ప్రార్థించుచున్నాను.

మానవులు సహజముగానే దోషములకు నిలయములగు చున్నారు. దోష మెవరియందో ఒకరియందు కనఁబడకతప్పదు. కాని ఒక మహోద్యమమును కొనసాగించుటకు బయలుదేరిన వారందరును ఏకీభవించి పనిచేయుటలో తమ సిద్ధాంతములను విడనాడకుండనే తమ తప్పులను ఒప్పుకొనుచు అందులకు క్షమాపణ వేడుచు యితరుల తప్పులను క్షమించుచు మనఃపూర్వకముగా ఉద్యమమును కొనసాగించుచుండవలెనని యీ కేసు విన్నవించుచున్నాను.

నేఁడు ఆంగ్లభాష మనదేశమునందు ప్రాధాన్యమును బడసి యుండుటచే ఆభాషలో నున్న పాశ్చాత్యవైద్యశాస్త్రము మున్నగునవిగూడ అభివృద్ధి నొందుచున్నవి. పాశ్చాత్య వైద్యకళాశాలలో కావలసిన పరికరములన్నియును సమగ్రముముగా నున్నవి. కొన్ని కళాశాలలలో సంస్కృతమునగూడ నేర్పిపరీక్షలు చేయుచు శాస్త్రి, ఆచార్య, మున్నగు పట్టములుగూడ నిచ్చుచున్నారు. ప్రస్తుతవిద్యావిధానమున పద్ధతులకుగూడ కొంత తావొసఁగబడియేయున్నవి. కాని ఆయుర్వేదమునకుగల అధిక ఖ్యాతికి అనుగుణమైన కళాశాల యొక్కటియును కనఁబడదు. చెన్నపురి, మైసూరు, సింహళము, సంయుక్త రాష్ట్రములు మున్నగు రాష్ట్రముల ప్రభుత్వములవారు ఆయుర్వేదమునుగూర్చికూడ ఇటీవల కొంత పనిని చేయ నారంభించిరి. పాట్నాలోని ఆయుర్వేద పాఠశాలకును వారిద్వారము వంగదేశ బుషికుల ఆయుర్వేద కళాశాలకును, కాశీనగర మందలి హిందూ విశ్వవిద్యాలయములోని ఆయుర్వేదకళాశాలకును, మరి పెక్కు ఆయుర్వేదసంస్థలకును ప్రభుత్వమువారు సాహాయ్యము చేయుచున్నందులకు మనము ఆయా రాష్ట్రముల ప్రభుత్వములకు వందనముల నర్పించుచు ఇతర రాష్ట్రముల ప్రభుత్వములవారుగూడ అటులనే చేయవలసినదని కోరవలసియున్నది.

శాసనసభలకు ఎన్నికలు జరుగునపుడు ఆయుర్వేదమందు అభిమానము గలవారే ప్రజాప్రతినిధులుగా ఎన్నుకొనఁబడునట్లు దేశమునందు పలుకుబడిగల ఆయుర్వేదవైద్యులందరు గట్టిప్రయత్నము చేయవలసియున్నది. ఆయుర్వేదమునుగూర్చి కొంచెమైన దెలియనివారు శాసనసభలలోను, స్థానిక సంఘములలోను సభ్యులుగా నుండుటవలననే వారిలో పెక్కుమంది ఆయుర్వేదమును నిరసించుటయు, దాని యభివృద్ధికి భంగము కలిగించుటయును తటస్థించుచున్నది. కావున, మనదేశమునందు అనాదిసిద్ధమువైద్యవిధానముగా నుండిన ఆయుర్వేదమును కాపాడుట భారతీయులందరికిని ముఖ్యకర్తవ్యమయియుండుటచే, శాసనసభలు, స్థానిక సంఘములు మున్నగువాని ఎన్నికలలో ఆయుర్వేదమునం దభిమానముగల వారికే వోట్లనిచ్చుట ముఖ్యకర్తవ్యమయియున్నది.

ఆయుర్వేద శాస్త్రమునందు ప్రవీణులగువారిని ప్రభుత్వమువారు పరిగణింపకుండుటగూడ శోకనీయకమే యయియున్నది. మనదేశమున ఆయుర్వేద వైద్యులుగానున్న వారిలో కొందరు స్వార్థపరత్వమున లేశమైన శాస్త్రజ్ఞానము లేనివారికిగూడ, ఆయుర్వేదపట్టముల నొసంగుచుండుట, ఆయుర్వేదాభివృద్ధికి ప్రబలనిరోధక మగుచున్నది.

పాశ్చాత్యవైద్యపట్టముల బడయఁగోరువారు మొదట పాఠశాలలలోన, కళాశాలలలోను పదునాఱేండు వత్సరములు విద్యనభ్యసించి, పిమ్మట నాలుగయిదేండ్లు మరల వైద్యకళాశాలలో విద్య నభ్యసింప వలసియున్నది. అట్టిచో ఆయుర్వేదము ఏభాషలోనున్నదో అట్టి భాషాజ్ఞానము లేశమైనలేనివారికి గూడ ఆయుర్వేదవైద్యులు కొందరు వైద్యరాజ, భిషగాచార్య మున్నగు పట్టముల నిచ్చుచుండుట మిగుల శోచనీయము. కృత్రిమములగు నీటిపట్టములొసంగబడుచుండుటవలన, నిజమైనవైద్యులెవరో, మోసగాండ్రెవరో ప్రజలు గుర్తింపజాలకుండ నున్నారు. ఇందువలన గొప్ప హాని కలుగుచున్నది.

ఆయుర్వేదము నభ్యసింపఁగోరువారు మొదట న్యాయ సాంఖ్య వ్యాకరణాది శాస్త్రములను కొంతవరకైన నభ్యసించి యుండుట యత్యవసరము. అటుపిమ్మట వారు సుప్రసిద్ధములగు నాయుర్వేద కళాశాలలలో జేరి పట్టము చేత, సమర్థులగు మహోపాధ్యాయులకడ విద్య నభ్యసింపవలయును. ఇట్లు మేరు ఆంగ్లభాషనుగూడ కొంతవరకు నేర్చియుండవలసిన యావశ్యకత యును నిపుడేర్పడినది. ఏలనగా, ఆది రాజభాషగా నుండుటయే కాక పెక్కు ఆయుర్వేద కళాశాలలలో శస్త్రచికిత్సా విధానమును, శరీర ధారుశాస్త్రమును గూడ ఆ భాషలోనే బోధింపబడుచున్నవి. ఆంగ్లభాషకొంచెమైన దెలియకుండిన నీరోజులలో నాయుర్వేదప్రచారమును చేయుట కట్టియవకాశమును గలుగదు. ఇపుడధికారమును, పలుకుబడియు గలవారందరును, లేక వారిలో హెచ్చుమంది యయినను పాశ్చాత్యశిక్షణ నొందినవారలుగనే యుందురు. ఆయుర్వేదమాహాత్మ్యము ఆంగ్లభాషలో వివరించినగాని వారు గ్రహింపజాలరు. వారుగాని సరిగా గ్రహింపజాలనిచో, దాని యందు వారికి విశ్వాసముకలుగజాలదు. ఈ కారణములవలన నాంగ్లభాషాభ్యాసముగూడ నవశ్యకర మేర్పడియున్నది.



ఆయుర్వేదశాస్త్రము సమగ్రముగను, హేతుబద్ధముగను కట్టింపఁబడియును లేదు. "ఇతరవిధానములందుగల విశేషములలో నాయుర్వేదమునందు లేనిది యొక్కటియు నుండదు. ఆయుర్వేదమునందున్నది ఇతరవిధానములందునూ యుండవచ్చును. కాని, ఆయుర్వేదమునందు లేనివిషయము మరి ప్రపంచమునందలి యేవిధానమునందును కనుపడదు" అని చరకాచార్యుడే స్పష్టముగా వ్రాసియున్నాడు. ఆతడు యెన్నియో వ్యాధులను గూర్చి తన గ్రంథమునందు చేర్చియుండుట మిక్కిలి యాశ్చర్యకరము.

ఇటీవల ఆంగ్లవిధానజ్ఞులు మహామారి, విషజ్వరము మున్నగు వ్యాధుల స్వరూపమును గ్రహించుటకే ఎన్నియో యత్నము చేసినవి. అట్టి దారుణవ్యాధులన్నిటినిగూర్చియు, చరక, సుశ్రుతాది ప్రాచీనగ్రంథములు, అట్టి ప్రాచీనకాలమునందే, స్పష్టముగాను, సంగ్రహముగాను వ్రాయబడియుండెను. సుశ్రుతములో మాత్రభాగమునందు జనపదోద్ధ్వంసప్రకరణమునందును, చరకములో విమానభాగమునందు మహామారి ప్రకరణమునందును వీనిని గూర్చి చదువదగిన విషయము లెన్నియో కలవు.

విషజ్వరము; ఇన్‌ఫ్లూయెంజా

"విషవాయువులుగాని, లేక విషముగల పూవులు, గడ్డి మున్నగువాని రేకలములుగాని, గాలితోకలిసి యొక దేశమునం దైనను లేక రాష్ట్రమునందయినను వ్యాపించినచో ప్రజలెట్టి ప్రకృతిగలవారయినను వారికందరికిని దగ్గు మిగుల్పుతలనొప్పి వాంతి జ్వరము మున్నగునవి గలుగును. ఇట్టి వ్యాధులకు పమున సోకును" అని సుశ్రుతాచార్యుడు వ్రాసెను.

మహామారి

ఈ వ్యాధి యెలుకలవలన గలుగునని సుశ్రుతాచార్యుడు వ్రాయుటయేకాక వ్యాధిని నిర్మూలించుటకును వ్యాధిక్రిముల సంహరించుటకును రోగి లోనిక్రిమ్ముకొనకుండుటకును ఇంటి యుండంతటను చల్లుటకును తిమ్మనగడ ఘోరగడ మున్నగు క్రిమిసంహారకములను ఔషధము లెన్నిటినో కూడ నతడు వివరించియుండెను. వీనిని మద్దెలకును డెప్పలకును రాసి వానిని రోగులకడ వాయించుచుండవలయును. పెద్దపెద్ద జెండాగుడ్డలకు వీనిని రాసి గాలిలో బాగుగా కదలించుచున్నచో, గాలిలోగల విషక్రిములన్నియు నశించిపోవును. ఈ రోగమందు మిక్కిలి గొప్ప శక్తియుండుటచే ఇది పూయబడిన వస్తువులను తాకుట, చూచుట మున్నగు సమయములవలనే రోగికి వ్యాధితొలగిపోవును. కావున అట్టి యిండ్లలో గోడలకుగూడ వీనిని పూయుచుండవలెను. వీనిని చెంతనుంచుకొనినమాత్రమునవే పాటెపురుగు, పాము, ఎలుక, కప్ప, పక్కి, కుక్క మున్నగువాని విషము ఎంతమాత్రమును బాధింపదని సుశ్రుతాచార్యుడు వ్రాయుచున్నాడు.

రసాయనికములలో కూడ నాయుర్వేదమే అగ్రస్థానమును బడసి యున్నది మకరధ్వజము ఆయుర్వేదమునకు చేరినదే. దానికి సాటియైన ఔషధ మేదియును గూడ పాశ్చాత్యవిధానమున లేదని గూడఘంటాపథముగా చెప్పవచ్చును. ఇట్టియు చాలమంది స్వార్థపరత్వము గలవారు, అజ్ఞానము గలవారు మాయమందులకు గొప్పగొప్ప పేరులనుపెట్టి, ప్రజలను మోసపుచ్చుచు శాస్త్రమునకు కూడ నపఖ్యాతిని దెచ్చుచున్నారు. మకరధ్వజమని చెప్పి 'సిన్నబారు' అను దానిని విక్రయించుచుండుటవలన, మకరధ్వజమునందు ప్రజలకు విశ్వాసము తొలగిపోవుచున్నందులకు నేను మిక్కిలి చింతిల్లుచున్నాను.

## భారతదేశము: భీమావ్యాపారము

(స్వదేశాభిమానం)

ఈదిగువ దేశములలో దామాయిషాను ఒక మనిషిచేసిన భీమా మొత్తము.

| | రూపాయలు | జనాభా |
|---|---|---|
| అమెరికా | 2000 | 117823165 |
| కెనడా | 1800 | 8788483 |
| న్యూజిలండు | 900 | 1372999 |
| గ్రేటుబ్రిటను | 600 | 42917382 |
| ఆస్ట్రియా | 600 | 6526661 |
| నార్వే | 450 | 2649775 |
| స్వీడన్ | 420 | 5987520 |
| నెదర్లాండ్సు | 390 | — |
| డెన్మార్కు | 330 | 3287831 |
| ఇండియా | 1½ | 318942480 |

భారతదేశస్థితి భీమావ్యాపారంలో అడుగంటియున్నదన్న సంగతి పై అంకెలవల్లనే తెలియుచున్నది. మనదేశములో యిపుడు 68 జీవిత భీమాకంపెనీలున్ను అగ్ని, పడవ మున్నగు తదితర భీమాసంస్థలు 12 కంపెనీలున్ను గలవు. మన దేశములో 23 విదేశీ భీమాకంపెనీల ఏజన్సీలవారు పని చేస్తున్నారు, వీరు చేసిన భీమామొత్తము 50 కోట్లున్నది. 68 స్వదేశభీమాకంపెనీలవారు చేసిన భీమా పైసాలీనా 8 కోట్ల ప్రీమియముల రూపకముగ కంపెనీకి చెల్లుచున్నది. జాబితిరా విదేశభీమాకంపెనీలకు భారతీయులు శ్రమపడి సంపాదించిన సొమ్మును పంపి విదేశీయులపరిశ్రమలకు తోడ్పడుచు స్వదేశమును దీనదశకు చేరులాడా తెలిసికొనుచున్నారు; ఇంగ్లండులో ప్రతి 8 గురికి ఒక్కమనిషి భీమాచేస్తే ఇండియాలో ప్రతి 2,200 మందికి ఒక్కమనిషి భీమాచేసెను. మన మెంత వెనకబడి వారమో చూచుకొనుడు. స్వదేశీ భీమాకంపెనీ లొక్కటి దానిలోనే స్వదేశీయులెల్లరు భీమాచేస్తే దేశములోని సొమ్ము ఏటేట పెరిగి పరిశ్రమాభివృద్ధి కాధారమై దేశదారిద్ర్యమును తొలగొట్టుటకు నెన్నియో సౌకర్యము లున్నవి.

*  *  *

## జీవిత భీమాలాభము

1. దారిద్ర్యమునకు శత్రువు
2. పిల్లల విద్యాసౌకర్యమునకు సహకారి
3. సంపాదన కూడబెట్టుటకు పునాది
4. ఎపుడు పనిచేసే అప్పుడు కటుంబానికి సహకారి
5. తొట్రుపాటు లేని పెట్టుబడి
6. అవసరము వచ్చినప్పుడు నిజముగా తోడ్పడును
7. ప్రతిమనిషి కొనుటకు అందుబాటులో నుండును
8. అవసరానికి అక్కరకు వచ్చే పెట్టుబడి
9. పెద్ద మొత్తంగా ఒకేసారి యిచ్చును
10. మనశ్శాంతి హాయి నిచ్చును

ఏజంటునకు:—లాభంకలిగే గౌరవమైన వృత్తి

కంపెనీకి:—ఒక సంస్థను నిర్వహించుటలో నైపుణ్యము

అక్చ్యుయరికి:—(లెక్కదారుడు) శాస్త్రపరిశోధనము

భీమా చేసినవానికి:—మనశ్శాంతి.

## స్వేచ్ఛ

100 కి 95 గురు 65 వత్సరముల వయస్సువచ్చినాకాని పెద్దగనో గొప్పగనో యితరులపై ఆధారపడి వారి పోషణలో నుంటున్నారు. ఇది అనుభూతంగా వచ్చుచున్నది. ఈఆచారమును తొలగించాలంటే సులభమే. ఒకరిపై నొకరాధారపడియుండటంవల్ల పరస్పరానురాగమునకు భంగమే కలుగుచున్నది గాని ఎక్కువ అగుటలేదు. స్వేచ్ఛకొరకు ప్రతిమనిషి తనయౌవనవయస్సులోనే తన జీవితాన్ని భీమాచేసుకుంటే ఒకరిని ఆశ్రయించి తాము గాని తనసంతతివారుగాని బ్రతుకవక్కరలేదు.

(శ్రీ సు॥)

## తిరుత్తని వార్తలు

(స్వకీయ విలేఖరి)

### అభినందన సభ

జనవరి 7:—నిన్నటి దినము సాయంత్రము 6 గంటలకు తిరుత్తని "కింగ్ జార్జి ఫిప్తు రీడింగురూము" భవనమునందు శ్రీయుతులు వి. మునిస్వామినాయుడుగారు దివాన్ బహద్దరు బిరుద మందినందులకు అభినందించుటకు గాను సదరు రీడింగు రూము సభ్యుల సమావేశ మొకటి జరిగెను. ఆసభకు తిరుత్తని కజెం మార్కెట్స డిప్యూటియిన్స్పెక్టరు శ్రీయుత వి. నాగరత్నయ్యరు బి. ఏ. ఎల్ టి. గా రధ్యక్షత వహించిరి. శ్రీనాయుడుగారి గుణ శీలములను గూర్చియు సాంఘిక సేవాపరత్వమును గూర్చియు రాజనీతివిధానములను గూర్చియు నుగ్గడించుచు శ్రీయుతులు డి. వేదాంతాచార్యులుగారు బి. ఏ. ఎల్. టి, వి. దేశప్పమొదలియారుగారు, బూదూరు రామానుజాలురెడ్డిగారు కె. వి. ధర్మయ్య శెట్టిగారు మున్నగువారు మాట్లాడి అభినందన తీర్మానములు గావించి యుండిరి.

### ఉన్నతపాఠశాలోపాధ్యాయసంఘము

ఈయూరియందలి బోర్డు ఉన్నతపాఠశాలోపాధ్యాయ సంఘ సభ్యులుగూడ నిన్నటిదినము సాయంత్రము 4½ గంటలకు శ్రీయుతులు డి. వేదాంతాచార్యులు బి. ఏ; ఎల్. టిం గారి అధ్యక్షతక్రింద సమావేశమై- శ్రీయుతులు వి. మునిస్వామినాయుడుగారికి "దివాన్ బహద్దరు" బిరుదము లభించిన విషయమును బురస్కరించుకొని అభినందన తీర్మానములుగావించిరి.

### తిరుపతిమహంతుగారి పర్యటనము

తిరుపతి దేవస్థానములకు ప్రస్తుతము ఇంటరింమహంతుగా వ్యవహరించుచుండు శ్రీరామచంద్రదాసుగారు వారి ప్రాప్రయిటరీకి సంబంధించినదగు మా తిరుత్తనితాలూకాలోని పెమ్మిలి, నెదుంబరము, పనపాకం మున్నగు గ్రామములలోని రైతుల పరిస్థితులను, తెరకొర్లను గమనించుటకై గతవారమున పర్యటనముగావించిరి. గ్రామాదులలోని రైతులు మహంతుగారి రాకతో తమకష్టములు తీరెనని మురియుచు, గౌరవమర్యాదలతో మహంతుగారికి స్వాగతమిచ్చి తమకుగల కష్టములనుగూర్చి దీనాతిదీనముగ విన్నవించుకొనిరిగాని, మహంతుగారు రైతులతో మనసిచ్చి చక్కగా మాట్లాడక పర్సనల్ క్లర్కుగారగు శ్రీయుత సుబ్బారావుగారిచే, ఆశువకందని పోకడపొందని మాటలు నాలుగేసిపలుకుచు మాట్లాడించి వెళ్లిపోయిరి. కొండంతయాశతోనుండిన రైతులు ఇంటెరింమహంతుగారి రాకచే చాలాపట్టిన కాకాభంగులై నిరుత్సాహపడుచున్నారు.

### హనుమంతస్వాముల నిర్యాణము

ఈయూరున కనతిదూరమున గల పెద్దనాయుడుపాళెం అను కోసలనగరమునందలి వంతినుండి ఒక బ్రాహ్మణకుటుంబమునందు జన్మించి పదునారవ సంవత్సరమునందే నారాయణమంత్రోచ్చాటనముతో సర్వసంగపరిత్యాగ మొనర్చి దిగంబరియై తమ యోగమాహాత్మ్యముల ప్రపంచమునకు చాటించిన హనుమంతస్వాములు అరువదియేడవ సంవత్సరమున ఆర్కాడు కుప్పంగ్రామములో గత వారమున నిర్యాణ మందిరి. నిర్యాణదినమును ముందుగనే నిర్ణయించి చెప్పియుండిరట. స్వాములవారి శిష్యబృందము సమాధి నొకదానిని గట్టుటకును పూజానిధులకును గట్టిప్రయత్నములు చేయుచున్నారు.



రాజా సర్ అన్నామలై చెట్టిగారి రాక:—బర్మాదేశము, మలయా దీవులు మున్నగు ప్రాంతములు జూచివచ్చిన చెట్టినాడు రాజాగారికి మదరాసు రేవుయందు స్వాగత మొసంగుట.
(పి. ఎస్. ఎ.)



మదరాసు కిరసనాయిలు కర్మాగారపు పనివాండ్ర సంఘము:—ఈ సంఘపు పదవ వార్షికసభ కధ్యక్షతవహించిన పి. వరదరాజులునాయుడుగారు మధ్య కూర్చొనియున్నారు. సురేంద్రనాధ ఆర్య, బి. శివరావు, ఆదికేశవులు నాయకరుగార్లు, తదితరులు యిందు గలరు. (పి. ఎస్. ఎ.)

బ్రిగేడియరు జనరలు సర్ చార్లెసుమాగ్నీకుగారు



మదరాసు, దక్షిణ మహారట్టా రైల్వే కంపెని డైరక్టరుల బోర్డుసభ్యులు, మదరాసు వచ్చిరి.
(పి. ఎస్. ఎ.)

జటప్రోలు రాజాగారి కంచు విగ్రహము.



కీ॥ శే॥ రాజా సురభి వెంకటలక్ష్మణరావు మైజాము నవస్వంతబహాదూరుగారి కంచువిగ్రహము జటప్రోలు సంస్థానమునందు ఈ నెల 14 వ తేదీన సంస్థాపింపబడును. మదరాసులోని శిల్పి నాగప్ప గారు దీని తయారుచేసిరి. (పి. ఎస్. ఎ.)

## భీమవరం

భీమవరమున శ్రీత్యాగరాజ స్వామివారి నవరాత్ర మహోత్సవములు పుష్యబహుళదశమి ది 24-1-30 శుక్రవారం నుంచి మాఘ శు॥ తదియ ది 1-2-30 శనివారం ఆఖరుగాను తొమ్మిది రోజులు యథాప్రకారము వైభవముగా జరుపబడును. సదరు ఉత్సవముల మొదటిరోజు అనగా ద్వాదశి ఆదివారం ఉదయం 7 గంటలనుంచి సంగీతపరిషత్ గుంటూరునివాసులును మహా పండితులును నగు బ్రహ్మశ్రీ వేదమూర్తులైన అవధాన శిరోమణి కాశీకృష్ణమాచార్యులవారి అధ్యక్షతను జరుగును. భీమవరం నివాసులు సంగీతవిద్వాన్ బ్రహ్మశ్రీ వేదమూర్తులైన వారణాసి బలరామ శాస్త్రిగారు ఆహ్వానసంఘాధ్యక్షులుగా నుందురు. గాయకులు హరిదాసులు మార్దంగికులు మొదలగు భక్తులును పండితులును దేశాభిమానులును దయచేసి సదరు మహోత్సవములను, సంగీతపరిషత్తును జయప్రదముగా జరిపించ ప్రార్థితులు - పన్నెండు సంవత్సరములనుంచి ఈ ఉత్సవములు జయప్రదముగా జరిపించుచున్న భీమవరం తాలూకా ప్రజలును తదితర మహాశయులును యథాప్రకారము తోడ్పడి మిత్రులతో దయచేసి ఆనందింప వేడుకొనుచున్నాను.

భమిడిపాటి సూర్యనారాయణ

కార్యదర్శి, శ్రీత్యాగరాజ భక్తసభ భీమవరం, భీమవరం రైల్వేజంక్షన్, పశ్చిమగోదావరి జిల్లా

## 14 వ కృష్ణామండల సహకార మహాసభ

14 వ కృష్ణామండల సహకార మహాసభను ఘంటశాలలో ఫిబ్రవరు 1. 2 తేదీలలో మ-రా-రా-శ్రీ నరసింహదేవర సత్యనారాయణగారి (అలమూరు) అధ్యక్షత క్రింద జరుపబడును. జిల్లాలోని అన్ని సహకార సంఘములవారు ప్రతినిధుల నెన్నుకొని తీర్మానములను ప్రతినిధి రుసుములను జనేవరి 25 తేదీలోగా ఆహ్వానసంఘ కార్యదర్శి పేర (చల్లపల్లి) పంప ప్రార్థన.

కొడాలి నరసింహారావు,
చల్లపల్లి ఆహ్వానసంఘకార్యదర్శి.

## పవిత్ర వివాహము

తూర్పుగోదావరిజిల్లా వల్లూరు గ్రామములో దేశాభిమానులగు శ్రీ చాగంటి అనంతరామయ్యగారి కుమారుడు చాగంటి వేణుగోపాలకృష్ణారావుగారికి యామన్య శాస్త్రసమ్మతమైన వివాహము జరిగెను. వధూవరులు సత్యాగ్రహ ఆశ్రమములో తయారైన పవిత్రఖద్దరు మధుపర్కముల ధరించిరి. వివాహమునకు వలయు వస్త్రము లన్నింటిని ఖద్దరు చేయించిరి. సభాకల్పము తిలక్ నిధికై రామచంద్రపురము తాలూకా కాంగ్రెసు సహాయకార్యదర్శులగు మ॥రా॥ వి. కృష్ణారావుగారు తీసిరి. వరుడు ఆలుకహాన్నపై దేశరక్షక వ్రతమును రాట్నమును కోరెను. ఊరేగింపు అవసరఖర్చులులేక నిరాడంబరముగా జరిగెను. ఇట్టి పవిత్రవివాహసుఖ మనుభవించిన దంపతు లెంతధన్యులో కదా? దేశాభిమానులగు యీ దంపతులను ఆయురారోగ్య ఐశ్వర్యంబులొసంగ సర్వేశ్వరు ప్రార్థించుచు దేశాభివృద్ధి కాదర్శప్రాయులగు నీ దంపతుల నాదర్శముగాగొని భారతయువకులెల్ల దేశోద్ధరణము నభివృద్ధిపరచి ధన్యులగుదురుగాక!

(ఒకవిలేఖరి)

నేపాలు నూతన ప్రధాని



ప్రోజ్వల నేపాళ తారాదీశ మహారాజ భీమశేను షేరు జంగుబహాదూరు రాణాగారు. నేపాలు దేశపు నూతన ప్రధానియు, సేనాధిపతియు, నేపాలురాజ్యమునందు ప్రధానామాత్యపదవిగూడ వంశపారంపర్యపు హక్కుగ నుండును. (ఎస్. ఇ. ఎ.)



రా॥ సా॥ ఆర్. సుబ్బయ్యానాయుడుగారు

బ్రిటిషు మలయాయందు ఇండియాప్రభుత్వ ప్రతినిధి. ప్రస్తుతము మదరాసు వచ్చియున్నారు. ఢిల్లీ పోవుచున్నారు. వీరిది నెల్లూరు స్వగ్రామము

## ఆదిద్రావిడబాలురకు పోలీసుసహాయము

ఆర్. కే. షణ్ముగంచెట్టిగారు

ఆదిద్రావిడుల హక్కులకొరకై పోరాడినవిధము

ఈనెల 6 వ తేదీ యందు మాన్య శ్రీయుతులు ఆర్. కె. షణ్ముగంచెట్టి, సిన్నస్వామి, ఈశ్వరన్ చెట్టియార్ గార్లున్ను, తదితరులును కోయంబుత్తూరు పట్టణమునకు సమీపముననున్న సింగనల్లూరు గ్రామమునకేగిరి. ఆ గ్రామములో బ్రాహ్మణవీధిలోనున్న ప్రాథమికపాఠశాలయందు చదువుచున్న ఆదిద్రావిడ బాలుర నావీధిని వెళ్లనీయకుండుటకు కారణమేమని వాకబుచేయగా, బ్రాహ్మణులను వారు తాకుదురనిరి. బ్రాహ్మణవీధికి వెనుకనున్న బాటమీదుగనే ఆదిద్రావిడ బాలురు ఒకటికి వెళ్లుట మామూలనియు, మామూలు నతిక్రమించి నేడు బ్రాహ్మణవీధిమీదుగా వెళ్లుట కేమియు నవసరములేదనియు వారు బదులొసంగిరి.

షణ్ముగంచెట్టిగారు పోలీసువారిని గొనివచ్చుట

పిమ్మట శ్రీయుత షణ్ముగంచెట్టిగారు పోలీసు డెప్యూటీ సూపరింటెండెంటు హోమ్సుమెన్ గారిని గొనివచ్చిరి. వీరి ప్రశ్నలకు కూడా నగ్రజాతులవారు (హిందువులు) పైన సూచించిన బదులే యొసంగిరి. బ్రాహ్మణవీధి గ్రామపరిపాలకసంఘము వారికి చెందినదిగాన ఆదిద్రావిడుల కావీధిని వెళ్లుట కధికారము గలదని పోలీసు సూపరింటెండెంటుగారు వారికి తెలియజెప్పి, ఆదిద్రావిడుల బాలురా బాటమీదుగానే బడికి వెళ్లుట కనుజ్ఞనొసంగిరి. మరియు నొక్క సబ్-యిన్‌స్పెక్టరును నలుగురు కానిస్టేబిలులను బందోబస్తుమీద నియమించి, వారు వెడలిపోయిరి.

పైసంభవమువలన ప్రజలలో నుద్రేకము కలిగియున్నదని "స్వదేశమిత్రన్" పత్రిక ప్రత్యేకవిలేఖరి ఆపత్రికకు వ్రాసిరి.



## అమియలాల్ బెనర్జీగారిపై మోపబడిన నేరములు

హైందవశిక్షాస్మృతి 124-ఏ, 121-ఏ, 120-బి విభాగములపై నాధారపడియుండుట

కలకత్తా, జన 8:—రాజషాహీ వద్ద తపాలా రెయిలుబండిలో దొంగతనము జరుపుటకు జరిగిన ప్రయత్నమునకు సంబంధించిన వ్యవహారములో, అమియలాల్ బెనర్జీ యనువాడు బారిసాలులో నరెస్టుచేయబడి యుండెను. నేటియుదయము కలకత్తాపట్టణ ప్రధానదండనాధికారి సమక్షమున హాజరు గొనిపోబడి, వారిచే యీనెల 17 వ తారీఖువరకు నిర్బంధములోనే యుండునట్లొనరింపబడెను.

సార్వభౌమునితో యుద్ధము జేసిరనియు, రాజద్రోహమొనరించిరనియు, కుట్రచేసిరనియు ఇతనిపై నిందారోపణ గావింపబడెను. (అ. ప్రె.)

ఈశాన్య సైబీరియా [illegible] నలుగురు చైనా[illegible]లు చనిపోయిరి.

## హాజీగారి కోస్తా నౌకావ్యాపార చట్టము

కలకత్తాలో సభ

కలకత్తా, జనవరి 8:—గతరాత్రి కలకత్తాలోని ఇండియన్ అసోసియేషనువారి యాజమాన్యమున సభ జరిగెను. డాక్టరు హెచ్. భక్తిగారు అధ్యక్షతవహించిరి. వైస్రాయిగారు జరిపిన సమాధానసభలో బ్రిటిషు వర్తకులకు భారతీయ వర్తకులకును రాజీ కుదురకపోవుటకు యీసభవారు చింతిల్లుచున్నారనియు హాజీగారు తయారుచేసిన చట్టములోని భారతీయుల అభిప్రాయములు న్యాయమైనవిగా నున్నవనియు భారతదేశమున కనిష్టనాయకుని యగు ఆర్. యస్. శర్మగారొక తీర్మానమును ప్రతిపాదించిరి. హాజీగారి చట్టములోని కోరికలు వ్యాపారాంగీకారములుగా లేకపోవుటవల్లనే యీసమాధానసభ జరుపబడినది గనుక యీసమాధానసభలో సమాధానము చేకూరకపోయిన అందులకు భారతీయ ప్రతినిధులే బాధ్యులుకారు.

ఈరీతిగా భారతీయులు న్యాయమైన కోర్కెలను సాధించుటకై ప్రయత్నించేయెడల [illegible] బ్రిటిషువారికి యీదేశములో అడుగుపెట్టనీయక చేయగలరను నమ్మకము బ్రిటిషువారి హృదయములందు స్థిరపడునట్లు నాటుకొని, భారతదేశమునకు అధినివేశ స్వాతంత్ర్యముకూడ లభింపకుండుటకు కారణమగును. (ఫ్రీ. ప్రె.)

మద్రాసునందు మరణసంఖ్య:— జనవరి 4.వ తేదికి అంతమగు వారమునందు మద్రాసులో వెయ్యింటికి 48.2 మరణములు సంవత్సరమునకు సగటున సంభవించెను. స్ఫోటకవ్యాధి 10 మందికి తగిలెను. వారిలో యిద్దరు చనిపోయిరి. కలరావలన 1 రు, మలేరియా వలన 6 గురు, యితరజ్వరముల వలన 37 మంది చనిపోయిరి.




# లాహోరుకాంగ్రెసు:

## పండిత మోతీలాల్ నెహ్రూగారు

ఇండియాసహాయమంత్రి యగు రస్సెలు ప్రభువు గారేమని యుపన్యసించిరో తెలియదు. వీరి యుపన్యాససంగ్రహమును పంపిన వార్తాసంఘము, ప్రభుత్వానుగ్రహము బడయుచున్నదే. ఆవేళ వశమున వీరు నిజమును పలికియుండవచ్చును. ఇట్టి సమయమునం దీప్రసంగమును గావించుట యనుచితమని యెల్లరకు దెలిసినప్పటికి, దానిని గావింపలేదని వారనినను నమ్మవచ్చును. కేంబ్రిడ్జిపైరు లేబరు పక్ష సమావేశములో వీరిట్టి ప్రసంగము గావించియుండిరి. ఇటుల బలికియుండుటకు కారణములు గూడ సూచింపబడుచున్నవి. రస్సెలు ప్రభువుగారి పెంపుడు కుక్క చనిపోయెనట. అందుచే తమ మనము కలత జెందిన సమయమున, వీరిటుల బలుకుట తటస్థించె నని, డెయిలీ మెయిలు పత్రిక సమాధానము జెప్పెను. పండిత మోతీలాల్ నెహ్రూగారును రస్సెలు ప్రభువుగారికి గలిగిన ఘోరవిపత్తు కొంతయు సానుభూతి జూపుచు, దుఃఖసమయమునందైనను వీరు సత్యమును వచించినందులకు వారిని అభినందించుచున్నారు. ఈవెనింగు స్టాండర్డు పత్రికలో ప్రచురింపబడిన వీరి ప్రసంగపుసైఖరి, తంతివార్తకు భిన్నముగ కనుపించదు. రస్సెలు ప్రభువుగారు మొదటనేమి జెప్పినను,పిమ్మట కాదనినను,తకుణ అధినివేశస్వాతంత్ర్య ప్రదానముపట్ల లేబరు ప్రభుత్వమువారు ప్రతికూలురని మాత్రము, పరిస్థితులు తేటపరచెను. వీరి యనుగ్రహమునే నమ్మికొనిన మితవాదులకు, రస్సెలు ప్రభువు ప్రసంగము కొంత ఆశ్చర్యము గలుగజేసినను, తదితరుల కట్టి ఆశ్చర్యమును గలిగింపలేదు.

పండిత మోతీలాల్ నెహ్రూగారు దెలిపినటుల, మద్రాసు మితవాద సమావేశమునకు రస్సెలు ప్రభువు తగినజవాబిచ్చెను. కాంగ్రెసు సభ సంవత్సరపు గడువు ముగిసినపిమ్మటనే, సంపూర్ణ స్వరాజ్య తీర్మానము నామోదించెను. నెహ్రూగారు దెలిపినటుల, స్వరాజ్య సంపాదన సాధనములను కాంగ్రెసు సభ నిరూపించినందులకు, మితవాదులు ఆశ్చర్యపడ నవసరము లేదు. కాంగ్రెసుకు లక్ష్యమెంతముఖ్యమో, దానిని చేయటగూడ అంతే ముఖ్యము. సర్వపక్ష సమావేశమువారు స్వరాజ్య విధానమును తయారుచేసినపుడు గూడ, ఇది సఫలముగానిచో కాంగ్రెసుసభ ఫలప్రదమగు మార్గములను చేపట్టునని, ఎల్లరకును తెలిసియే యుండెను. మితవాదులు మాత్రము, ఎప్పటి పద్ధతులనే అవలంబింప నెంచిరనియు, తెలిసినవిషయమే. అట్టితరి, మితవాదులు కాంగ్రెసును అనవసరముగ దూషించుచేలయని, నెహ్రూగారడుగుచున్నారు.

సంపూర్ణస్వాతంత్ర్యమును లక్ష్యముగ నైకొనుచు, శాసనోల్లంఘనమును సాధనముగ నంగీకరించువారు కొందరు, శాసనసభల బహిష్కారమును నిరసించుట మిగుల శోచనీయమని, నెహ్రూగారు భావించుచున్నారు. మితవాదుల ప్రాతికూల్యమున కర్థమును గ్రహింపవచ్చును. కాని, కొందరు సంపూర్ణస్వాతంత్ర్యవాదులవిముఖత కర్థమును గ్రహింప వీలు లేకున్నది.

వీరి ప్రాతికూల్యము కాంగ్రెసు ఆదేశ గౌరవమును క్షీణింపజేయుటకు తోడ్పడునుగాని, వేరొక ఫలితమునకు తోడ్పడజాలదు. శాసనసభ్యత్వపదవులకు రాజీనామానిచ్చినను, మరల వ్యక్తిగతముగ ఎన్నికలకు నిలువవలయునను సలహా కాంగ్రెసు సభ్యుల గౌరవము వినుమడింపచేయజాలదు. కాంగ్రెసు సభ్యుల రాజీనామాల విషయమున, వంగ రాష్ట్రము ముందడుగు వైచి, తన కీర్తిని నిలువబెట్టుకొనుచున్నది. శ్రీసేన్ను వార్తప్రకారము ఇరువదియిద్దరు సభ్యులు తమపదవులకు రాజీనామా నిచ్చిరని తెలియుచున్నది. మిగిలిన సభ్యులుగూడ వీరిమార్గము ననుసరించెదరని నమ్మవచ్చును. ఆంధ్రదేశమునందు భారతశాసనసభలో జేరిన కాంగ్రెసు పక్ష సభ్యులును, స్టేటుకౌన్సిలు సభ్యులును రాజీనామా నిచ్చిరి. మదరాసు శాసనసభ్యులు గూడ త్వరలో నీమార్గము నవలంబించెదరని నమ్మవచ్చును. స్వాప్నికపదములను గోరంతలు కొండంతలు చేసి, నిస్సారమగు సిద్ధాంతములను ప్రతిపాదించుచు, నూతన పక్షములను లేవదీయువారు, మద్రాసు మెయిలు మున్నగు ఆంగ్లో-హైందవ పత్రికల అభినందనముకు పాత్రులుగావచ్చునుగాని, దేశగౌరవపాత్రులు గాజాలరు. స్వరాజ్యపక్షమును మొదట స్థాపించినపుడు, శాసనసభలలో ప్రవేశింపగోరుటకు కారణమెద్దియో నిరూపించి, ఇప్పు డట్టిపరిస్థితులు లేవని, నెహ్రూగారు సహేతుకముగ నిరూపించిరి. స్వరాజ్యపక్షస్థాపకులలో నొకరగు నెహ్రూగారి ప్రతిపాదనమును సులభముగ నిరాకరింప వీలుండదు.

బార్డోలీ సంఘటనానంతరము, గాంధి మహాత్ముడు నిర్బంధింపబడెను. వీరు లేని సమయమున, శాసనోల్లంఘనమునకు దేశమును సిద్ధపరచువారు లేకపోయిరి. అందుకు తగిన వాతావరణము లేదని, శాసనోల్లంఘనవిచారణసంఘమువారు నిరూపించిరి. అట్టి సమయమున శాసనసభలలో ప్రవేశించి ప్రతిఘటనము సలుపుట యైనను, జడత్వముకన్న మేలని, దేశబంధుదాసుగారును, పండిత మోతీలాల్ నెహ్రూగారును వాదించియుండిరి. శాసనోల్లంఘనమునకు కాంగ్రెసు పూనుకొనవల, శాసనసభాప్రవేశమును తాము మానుకొందుమని, వీరు నుడివిరి. ఇప్పుడు శాసనోల్లంఘనముద్వారా సంపూర్ణస్వాతంత్ర్యమును జేరుటకు లాహోరు కాంగ్రెసుసభ నిర్ణయించెను.అందుకు ప్రథమసాధనముగ శాసనసభల బహిష్కారమును నిరూపించెను. ఇంతియగాక, స్వరాజ్యపక్షమునకు అధినివేశస్వాతంత్ర్యమే లక్ష్యముగ నుండెను. అందుచే శాసనసభలద్వారా దీనికై పని జేయు సంకల్ప ముండుట వింత గాదు. ఇంగ్లండుకు తమ సంకల్పమును తెలుపుటకు, శాసనసభ లుపయోగింపబడెను. ఇప్పుడు సంపూర్ణస్వరాజ్యము లక్ష్యమగుటచే, శాసనసభలద్వారా దీనిని పొందనెంచుట, విరుద్ధము. ప్రజాశక్తిని పెంపొందించుట దప్ప వేరుమార్గము గనుపింపదు. నెహ్రూగారు దెలిపినటుల స్వరాజ్యపక్ష శిక్షణము లోపభూయిష్ఠమయ్యెను. సభ్యులు పలువురు, ఇండియా ప్రభుత్వపు కమిటీలలో ప్రవేశింపసాగిరి. రాష్ట్రీయ శాసనసభలలో పరిస్థితులు మరింత క్షీణగతి గాంచెను. శాసనసభలద్వారా, కొన్ని మేళ్లు చేకూరగలేదని, నెహ్రూగారయినను దెలుపుట లేదు.

ప్రజల కష్టములను కొన్నిటిని నివారించుటకు వీనిద్వారా వీలు లేకపోలేదు. కాని, స్వాతంత్ర్య సంపాదన కివి సాధనములుగ నుండగలవను ఆశ మాత్రము అడుగంటి చాలకాలమయినది. ఇవి ప్రతిబంధకములుగ గూడ పరిణమించుచున్నవి. త్రివిధ బహిష్కారము లేనియెడల, ఏ బహిష్కారమును జరుగగూడదను వాదమునకు, నెహ్రూగారు తగిన జవాబిచ్చిరి. శాసనసభలద్వారా, స్వరాజ్యమును బడయవచ్చునను భ్రమ, దేశము నావరించి యుండుటచే, ఇది తొలగి పూర్ణస్వరాజ్యవాంఛ ప్రజలలో పెరుగుట కిట్టిభ్రమను తొలగించుట యవసరముగుచున్నది. న్యాయస్థానములలో పని చేయువారు, భుక్తికొరకే అటుల గావించుచున్నారు గాని, దేశసేవనిమిత్తమని దెలుపుటలేదు. అందుచే శాసనసభా బహిష్కారమునకును న్యాయస్థానబహిష్కారమునకును పోలిక లేదు. ఇటులనే అస్వతంత్రులగు విద్యార్థులను పాఠశాలలనీ సమయమున విడనాడవలయు నని కోరుటకును వీలు గనుపింపదు. గాంధి మహాత్ముడు దెలిపినటుల త్రివిధబహిష్కారముగాక పంచవిధబహిష్కారముగూడ వాంఛనీయమే యయినను, బహిష్కార కార్యక్రమమునకు అనుకూలవాతావరణము గలిగించునిమిత్తము క్రమాంతరముల నేర్పరుపవలసిన యవసరము గలుగుచున్నది. గాంధి మహాత్ముని స్వయముగ నేబహిష్కారమును బాధింపజాలదు. కాని, దేశపరిస్థితుల ననుసరించి, మహాత్ముడు తన కార్యక్రమమును నిర్ణయింపవలసివచ్చెను. గాంధి మహాత్ముడు భారతీయుల కనీసధర్మమును నిర్ణయించెను. అనంతర కార్యక్రమమును పిమ్మట నిర్ణయించును.ఇందునిమిత్తము సబర్మతీ ఆశ్రమమునందు మహాత్ముడు దీర్ఘముగ యోచించుచున్నాడు. మరల చౌరీ చౌరా సంఘటనలు సంభవింపనిమార్గమును ఆలోచించు చున్నాడు. శాంతిసహితశాసనోల్లంఘనపు పరిహద్దులను లెస్సగ గుర్తెరిగిన మహాత్మునకు, ఈ విషయము పట్ల సంపూర్ణనిర్ణయము వదలివైచుట యవసరము. గాంధిమహాత్ముని అండజేరి, కాంగ్రెసు సభ్యులెల్లరును, వారియాదేశములను శిరసావహించి నడువవలయునని, పండిత మోతీలాల్ నెహ్రూగారు చేసిన ఎచ్చరికను భారతీయు లనుసరించుట యవసరము. మహాత్మునికన్నను దేశము నీ సందిగ్ధ సమయమున భద్రముగ నడుపగలవారింకొకరు గనుపింపరు. ఈసమయమున మహాత్ముడు నాయకత్వభారమును వహింప నంగీకరించుటయే గొప్ప అదృష్ట మని భావింపవచ్చును. నెహ్రూగారు దెలిపినటుల, వాదప్రతివాదములకీ సమయమున తావు లేదు. అమృతబజారుపత్రిక దెలిపినరీతిని, డెమోక్రటిక్కు పక్షమువారు ప్యారలల్ పరిపాలనము స్థాపింపబూనకపోయినను, కాంగ్రెసుకు వ్యతిరేకముగ మాత్రము ప్యారలల్ పరిపాలనము స్థాపించుచున్నారు. కాంగ్రెసుపై సత్యాగ్రహము సలుపుటకు వీరు

ముందుకు వచ్చుచున్నారు. ఇట్టిభేదవాదులకు దేశము ప్రోత్సాహ మొసగక, వీరి చెలగాటములను లక్ష్యపెట్టకుండుట ధర్మము. అప్పుడు వీరు తాము జేసినలోపము గ్రహింపగలుగుదురు. దేశ మీసమయమున, కాంగ్రెసు ఆదేశములను శిరసావహించి, గాంధిమహాత్ముని నాయకత్వముక్రింద, గమ్యస్థానము జేరుగాక యని కోరెదము.

## బ్రిటీషు పత్రికల గగ్గోలు

కాంగ్రెసు తీర్మానము బ్రిటీషుపత్రికలను, బ్రిటీషు ప్రముఖులను తల్లక్రిందు జేసెను. తా మనుభవించు చున్న స్వేచ్ఛను, ఇతరు లనుభవించుట వీరి కిష్టము లేదని, వీరి వ్యాఖ్యానములు స్పష్టపరచు చున్నవి. నిర్బంధప్రయోగమే శరణ్య మని, వీరు బోధించు చున్నారు. లాహోరు కాంగ్రెసు సభకు ఆహ్వానసంఘాధ్యక్షులు యైన డాక్టరు కిచ్లూగారిపై ప్రభుత్వము వారు చర్య గైకొన దలచుచున్నా రని, డెయిలీ టెలిగ్రాఫ్ పత్రికా ప్రతినిధి లేఖవార్త నంపెను. ఇండియా ప్రభుత్వమువారు అతివాదులపై నింత దయ జూపుట పనికిరాదని, లండను ఈవెనింగు న్యూసుపత్రిక చాటుచున్నది. బెంగాలుప్రభుత్వము వారు సర్వసన్నాహముల గావించుచున్నా రని డెయిలీ హెరాల్డు పత్రిక వార్తను ప్రచురించెను. ఇండియా ప్రభుత్వమువారు తొందరపడనియెడల, లేబరు ప్రభుత్వమువా రయినను తొందరపడరని, తెలియుచున్నది. అయినను, కన్సర్వేటీవుల ప్రోద్బలమువలన వీ రెట్టి మార్గముల నవలంబించెదరో చెప్ప వీలు లేదు. భారతీయ అతివాదుల సద్భావమును సంపాదించుటకు ప్రయత్నించుచో, దేశమునందు ఎట్టి దుస్థితి వాటిల్లునో ఇండియా మంత్రిగారు యోచింపవలయు నని, మార్నింగు పోస్టు పత్రిక గర్జించుచున్నది. ఐరిషు టైమ్సుపత్రిక హిందూ దేశమున కిదివర కిచ్చిన సంస్కరణములనుగూడ లాగివేయవలయు ననియు, సైమనుకమిషనును రద్దుజేయవలయు ననియు, హిందూదేశమును కఠినముగ పరిపాలింపవలయు ననియు కోరుచున్నది. ఇదివర కున్న సంస్కరణముల నూడబెరికినను, సైమను కమిషనును రద్దుజేసినను, దేశమునం దెవరును చింతింపబోరని, యీపత్రిక గ్రహింపవలయును. దేశము స్వాతంత్ర్యసిద్ధికై పాటుబడుట కెక్కువ ప్రోత్సాహ మిందువలన గలుగకమానదు. కాంగ్రెసు కు ప్రజలలో చాల పలుకుబడి గలదనియు, కాంగ్రెసు సవాలును ఇంగ్లండు అంగీకరింపవలయు ననియు, క్రిందియధికారులు తలపెట్టిన నిర్బంధములకు పై యధికారులు బలపరుపవలయుననియు, తూర్పుదేశ ప్రజలు క్షేమమునిమిత్తము ఎక్కువ కోర్కెల గోరుట మామూ లనియు, మెస్టను ప్రభువుగారు పత్రికాప్రతినిధితో నుడివిరి. సంపూర్ణస్వాతంత్ర్యము హిందూదేశమునకు చేకూరుచో, పఠాను లీ దేశము నాక్రమించెద రనియు, పెషావరు కలకత్తాల మధ్య ఒక్కరూపాయి యయినను నిలువదనియు, సర్ హామిల్టను గ్రాంటుగారు తెలిపినయభిప్రాయము, మామూలు కేకయే గాని వేరుగాదు. లాహోరులో వినిపించిన పిచ్చికేక లన్నియు, సందర్భ మెరుగని కేక లని, సర్ హార్ కోర్టుబట్లరుగారు నుడివియుండుట వింత గాదు. వీరు తమ రిపోర్టులో అధినివేశ స్వాతంత్ర్యము దేశమునకు లభింపకుండుటకు సంస్థాన సమస్యను అడ్డుగ బెట్టిరి. ఈరీతిని, ఎవరియిచ్ఛ వచ్చిన రీతిని వారు గంద్రగోళము సలుపుచున్నారు. ఇక గాంధిమహాత్ముని దూషించుటలో, ఒకరినొకరు మించుచున్నారు. గాంధి, కుట్రాలోచనల జేయు వనియు, నీచు డనియు, మార్నింగుపోస్టు పత్రిక ప్రలపించెను. గాంధి యంతటి మోసగాడు లేడని, సర్ మైకేలు ఓడ్వైయరుగారు దెలిపి, తమకసి దీర్చుకొనిరి. మెస్టను ప్రభువు హిందువులపై ప్రత్యేకాగ్రహము జ్ఞాపుచున్నాడు. ఇటుల గావించుటలో వీరియుద్దేశ్య మేమియో తేటతెల్లమే. ప్రపంచశాంతిని, యుద్ధబహిష్కారమును ఒకవంక గోరుచు, బ్రిటీషువారు తదాశయములకు విరుద్ధముగ హిందూదేశ స్వయంనిర్ణయస్వాతంత్ర్యమును నిరాకరించి, నిర్బంధములద్వారా ప్రజలకోర్కెను నిరోధింపజూచుట, ఎంత హాస్యకరమో యూహింపవచ్చును. ఇట్టి నుడువులు, ప్రజల స్వాతంత్ర్యవాంఛను మరింత బలపరచుటకే తోడ్పడునని, తెలుపనక్కరలేదు.

---

లోకలుబోర్డుల సవరణచట్టము :

సెలెక్టుకమిటీ రిపోర్టు

లోకలు బోర్డుల చట్టము విషయమై సెలెక్టు కమిటీవారు తయారుచేసిన నివేదకపు సంగతు లిదివరకే బయల్పడినవి, గత ఫోర్టుసెంటు జార్జి గెజెట్టులో ముద్రింపబడెను. మ్యునిసిపాలిటీల చట్టమువలె దీనికిని, భిన్నాభిప్రాయములు చాల ప్రకటింపబడెను. సెలెక్టు కమిటీవారు చట్టములో కొన్ని మార్పులను సూచింప గలిగిరి గాని, పునాదులను కదలింపలేక పోయిరి. సెలెక్టు కమిటీవారు ప్రతిపాదించిన సూత్రముల ననుసరించి చట్టమును మరల తయారు జేయుట యవసరమగుచున్నది. సవరణ చట్టము ప్రకారము, యూనియను బోర్డు లికమీద పంచాయతీ లనబడును. జిల్లాబోర్డులు, తాలూకా బోర్డులు ఎప్పటివలె నిలిచియుండును. పంచాయతులలో మాత్రము యుక్తవయస్సు వచ్చినవారెల్లరకును వోటింగు అధికార ముండవలె నని, సెలెక్టు కమిటీవారు నిర్ణయించిరి. లోకలు బోర్డులను ప్రభుత్వము వారు సూపర్ సీడు చేయుటకు వీలు లేకుండ జేసిరి. వేయిమంది ప్రజలు గల గ్రామములలో పంచాయతులు నేర్పరుప గోరిరి. పంచాయతుల రాబడి మార్గము లభివృద్ధి గావింపబడెను. లాండు సెస్సులో జిల్లాబోర్డుకు ఆరుపైసలను, తాలూకాబోర్డుకు ఆరుపైసలను, పంచాయతులకు మూడు పైసలను, గ్రామాభివృద్ధినిధికి మూడు పైసలను ప్రత్యేకించుట కేర్పాటు సూచింపబడెను. నలువది ఆర్గురు సభ్యులలో ముప్పదితొమ్మిదిమంది సభ్యులు భిన్నాభిప్రాయములను ప్రకటించిరి. డాక్టరు సుబ్బరాయన్, ముత్తయ్యా ముదలిగార్లును, హిల్టను బ్రౌను, దూథమష్టు, గోవిందదాసనాయుడుగార్లును, గ్రామపంచాయతులలో నయినను యుక్తవయస్సు వచ్చినవారికి వోటింగుహక్కు నొసగగూడ దని తెల్పిరి. వేయిమంది ప్రజ యున్న గ్రామములలో పంచాయతీని నెలకొల్పవలయునను నియమము అనుకూలముగ లేదనియు, లోకలుబోర్డులను సూపర్ సీడు చేయుటకు ప్రభుత్వమున కధికారముండవలయు ననియు, లోకల్ బోర్డుల నిబంధనలకు శాసనసభ వారి సమ్మతి గావలయునను నేర్పా టుండగూడదనియు, సవరణచట్టమును వెంటనే యమలులో బెట్ట వీలులేదనియు, కలెక్టరులకు గల అసాధారణాధికారము లేమాత్రము తగ్గగూడదనియు, వీరు చాటిరి. వీరి సిఫార్సులు, సెలెక్టుకమిటీవారు సూచించిన విశాలమార్గముల నన్నిటిని నిరాకరించుచు, చట్టమును మిగుల సంకుచితము గావింపకమానవు. మ్యునిసిపాలిటీల చట్టము విషయమునను, మంత్రులు సంకుచితమగు ఏర్పాటులనే సూచించియుండిరి. మిగిలినవారు ప్రచురించిన భిన్నాభిప్రాయములలో ప్రత్యేకముగ గమనింపవలసిన విషయములు గనుపింపవు. జిల్లాబోర్డుల నెత్తివేయవలయు నని కొందరు సూచించిరి. నిమ్నజాతుల ప్రతినిధులు ప్రత్యేకనియోజకవర్గములను కోరిరి. కాశీశ్వరరావుగారును, విశ్వనాథదాసుగారును అభివృద్ధికర మగు సూచనల గావించిరి. దేశీయ వైద్యమునకు ప్రోత్సాహ మొసగుటకు లోకలుబోర్డులు పూనవలసియుండ, అట్టి ఏర్పాటులు లేనందుకు, విశ్వనాథదాసుగారు చింతించిరి. కాశీశ్వరరావుగారి మ్యునిసిపలు చట్టముపై గూడ, సెలెక్టు కమిటీవారు ప్రధానమంత్రిగారి చట్టముపై దెలిపిన యభిప్రాయములనే పొందుపరచిరి. యుక్తవయస్సు వచ్చినవారికి వోటింగు అధికార మిచ్చుట పనికిరాదని, ప్రధానమంత్రిగారు పూర్వాభిప్రాయమునే మరల దెలిపిరి. స్థానిక స్వపరిపాలనమును విశాలపరుచు ప్రయత్నములకు వీరు అడ్డుతగులుట శోచనీయము.

---

వితండవాదులు

హాజీ తీరవ్యాపార చట్టమును, భారతీయు లెల్లరును ఆమోదించుచుండ, ఎంపైరు అసోసియేషను యాజమాన్యముక్రింద జరిగిన సభలో నది నిరసింపబడెను. కొంతకాలము నుండియు ప్రభుత్వాభిమానము బడయుచున్న ఆర్. యన్. శర్మగారు హాజీగారి చట్టమును నిరసించుచు ప్రసంగించిరి. ఇటీవల జరిగిన సమావేశమునందు అనుకూలపరిష్కారము గుదురనందుకు, భారతీయ వర్తకుల మూర్ఖతయే కారణ మని వీరు వాదించిరి. ఎంపైరు అసోసియేషనువారు సామ్రాజ్యవర్ధనమునను చేయుట కిట్టిమార్గములనే అవలంబించెదరు గాబోలు. భారతీయ వణిక్కులు చూపిన పట్టుదలవలన, అధినివేశ స్వాతంత్ర్యము త్వరలో చేకూరెడిఆశ యంతరించెనట. తీరవ్యాపార చట్టమును దేశము ఆమోదించనిచో, అధినివేశ స్వాతంత్ర్యము వెంటనే చేకూరియుండును గాబోలు! శర్మప్రభృతుల దృక్పథము జూచిన, భారతీయులు తలవాల్పవలసి యుండును.

---

నూతనయంత్రము

ఇంగ్లండుకును జర్మనీకిని మధ్య ఏర్పాటుచేయబడిన నూతనయంత్రము ద్వారా, ఛాయాపటములనుగూడ తంతిద్వారా పంపవచ్చును. ఇకమీద వార్తా పత్రికలను ఛాయాపటములు వార్తలతోబాటు చేరుటకు వీలగును. చెక్కుల దస్తావేజుల పటములనుగూడ పంప వీలు గలదు. అది టపాద్వారా చేరువరకు వేచియుండ నక్కరలేదు. నూతనయంత్రము, వ్యాపారస్థులకును తదితరులకును గూడ, విశేషముగ నుపయోగపడగల దని యూహింపవచ్చును.

# స్థానిక వార్తలు

**భారతశాసనసభ కెన్నుకోబడిన మద్రాసు యూరోపియను సంఘప్రతినిధి:—** భారతశాసనసభ యెన్నికకు మద్రాసు యూరోపియనుసంఘ అభ్యర్థిగా విలియం అలెగ్జాండరుగారొక్కరుమాత్రమే నిలిచినందున పోటీలేకుండ నే వీరెన్నుకోబడిరి.

**డి॥ బ॥ యం. కే. రెడ్డిగారు స్టేటుకౌన్సిలు అభ్యర్థిగా నిలచెదరు:—** గౌ॥ రావు॥ యు. రామరావు గౌ॥ వి. రామదాసు పంతులుగార్లు తమ స్టేటుకౌన్సిలు సభ్యత్వమునకు రాజీనామల నొసగుటచే ఖాళీపడిన స్థానములలో నొకదానికి డి॥ బ॥ యం. కే. రెడ్డిగారు అభ్యర్థిగా నిలుచెదరని తెలియుచున్నది. (శ్రీ ప్ర.)

**మద్రాసు జాతీయ స్వచ్ఛందసేవకదళము:—** నేడు ఆదివారమున రేపు సాయంకాలము 6 గం. సేవియోపార్కునందు బహిరంగసభ జరుగును. ప్రముఖ కాంగ్రెసు వాదులు సంపూర్ణస్వాతంత్ర్యము 26 వ తేదిని జరుగబోవు జనవర్యాళ స్వాతంత్ర్య దినోత్సవము గూర్చి ఉపన్యసించెదరు. శ్రీ. యస్. సోమయాజులువారు అధ్యక్షత వహించెదరు.

**మద్రాసు గవర్నరుగారు మేటూరుకు వెళ్లెదరు:—** మద్రాసుగవర్నరుగారు మిలిటరి సెక్రెటరి అంతరంగిక కార్యదర్శులతో నేటిరాత్రి మేటూరుకు వెళ్లెదరు. మేటూరు ప్రాజెక్టు తనిఖీ చేయుటకు వీరువెళ్లుచున్నారు. వీరు అచటనుండి వేలూరుకు పోలీసు పందెములయొద్ద అధ్యక్షతవహించుటకు వెళ్లెదరు. ఆదివారము ఉదయమున మరలి మద్రాసుకు తిరిగి వచ్చెదరు.

**సనాతనధర్మనాయకుల సమావేశము:—** సనాతన ధర్మనాయకుల సమావేశము తంజావూరు జిల్లా తిరువాడియందు రాబోవు 12 వ తేదీని జరుగునటులు నిశ్చయింపబడినది. ప్రత్యేక రాజకీయ పక్షమును నెలకొల్పుట, సమావేశ ముఖ్యోద్దేశ్యము జయప్రదముగా కొనసాగించుటకు వలయు ధనమును వసూలుచేయుట మొదలగు విషయములు యీ సభయందు చర్చింపబడును. ఈ సమావేశాభిమానులెల్లరు సభకు రా ప్రార్థితులు. అని సమావేశ కర్తలు విన్నవించుచున్నారు.

**చెన్నరాష్ట్రీ బాలభటుల సంఘము 8-వ వార్షిక సభ**

చెన్నరాష్ట్రీ బాలభటులసంఘపు 8-వ వార్షికసభ రాబోవు 18-వ తేదిని జరుగునటుల నిశ్చయింపబడెను. కార్యనిర్వాహక సంఘసభ ఆనాడు ఉదయము 8 గంటలకు జరుగును. కార్యనిర్వాహక సభ్యులు, రాష్ట్రసంఘ సభ్యులకు విందొసంగబడు. సాయంకాలము 6 గంటలకు బహిరంగ సమావేశము జరుగును. మద్రాసు గవర్నరు లెఫ్టినెంటు కలనల్ సర్ జార్జి స్టాన్లీ గారు రాష్ట్రప్రధానభటులు అధ్యక్షత వహించెదరు. ఆనాటిరాత్రి రాష్ట్రీయ సంఘపు సభ్యులకెల్ల విందొసంగబడు. ఈ కార్యక్రమమంతయు బాలభటరాష్ట్రీ ప్రధానకార్యాలయమునందే జరుగును.

**శ్రీ కందస్వామిదేవుని బ్రహ్మోత్సవము:—** ప్రతిసంవత్సరము జరుగునట్టి శ్రీకందస్వామి దేవుని బ్రహ్మోత్సవము ప్రస్తుతము జరుగుచు పెక్కుమంది ప్రేక్షకులను ఆకర్షించుచున్నది. 8 శతాబ్దముల క్రితము యీదేవాలయమును శెట్టి వైశ్యకులజులు స్థాపించిరి. అప్పటినుండి ఆకులమువారే యీ దేవాలయ కార్యములెల్ల నిర్వహించుచున్నారు.

గాక! ఇతర ప్రయత్నములతో బాటు, శాసనోల్లంఘనకార్యక్రమముకూడ మిక్కిలి జాగరూకతతో పరిశీలింప వలసివది. దానిని ఫలవంతము చేయుటకు ప్రతి యొకరును మన శక్తులను వసమూర్చుకొని యుండవలెను. తమనేమి ప్రభుత్వమునకు ప్రతి ప్రభుత్వమును స్థాపింపవలయునని చేయవలసినదానికి కేవలము విరుద్ధముగా ప్రయత్నించుచున్నారు. కావున పునశ్చ సమయము. విధేయత ప్రస్తుతము మిక్కిలి యవసరము, గాంధిమహాత్ముని కార్యక్రమము ఇదవరకు ఆమోదించి నిశ్చయించిన వారు తమ సర్వసేనానితో యాజ్ఞను శిరసావహించెదరు గాక యని కాంగ్రెసు వాదుల నందరను నేను కోరుచున్నాను.

బ్రహ్మోత్సవము 12 వ రోజున మద్రాసు గవర్నరుగారును లేడీ బియాట్రిస్ స్టాన్లీ గారును ఉత్సవమును చూచుటకు వచ్చెదరు. గవర్నరు దంపతులకు 16 వ తేదిని రాత్రి 9-30 గం. వైనా బజారురోడ్డునందు కట్టబడిన ప్రత్యేకమంటపమునందు ట్రస్టీలు ఆహ్వాన మొసంగెదరు. ఆనాటిరాత్రి అద్దాలపల్లిక ఉత్సవము జరుగును.

**రైల్వేప్రయాణికుని ఆకస్మిక మరణము:—** 35 యేండ్లవయస్సుగల మహమ్మదీయుడొకడు గత 7 వ తేదిని రాత్రి మద్రాసునుండి వెడలిన తిరుచేంద్రపురము ఎక్స్‌ప్రెస్ యొక్క 3 వ తరగతి పెట్టెయందు ఆకస్మాత్తుగా చనిపోయెను. పోలీసువారు శవమును బండినుండి దింపిరి. చనిపోయిన మహమ్మదీయుని వద్దనుండిన కాగితములవలన యీ మహమ్మదీయుడు తిరువళ్లూరి వాస్తవ్యుడనియును, యీతడు తన జన్మస్థానమునకు పోవుటకుగాను రంగూనునుండి కొద్దిరోజులక్రిందటనే మద్రాసువచ్చెననియును తెలియుచున్నది. ఈ మహమ్మదీయుడు బండినెక్కిన సమయమున సంపూర్ణారోగ్యము కలిగియుండెను. మరణకారణ విచారణయందు యీతని గుండెకు పనిచేయుట తటాలున నిలిచిపోవుటచే యీతడు చనిపోయెనని నిర్ణయింపబడెను.

**రాకపోకలు:—** గౌ॥ వి. రామదాసు పంతులుగారు 6 వ యీస్టు తిరువాన్కూరు సహకార సమావేశము అధ్యక్షత వహించుటకు నిన్న రాత్రి క్విలానుకు వెళ్లిరి. స్వతంత్రపక్ష అభ్యర్థిగా వీరు మరల స్టేటుకౌన్సిలు ఎన్నికయందు నిలుచునట్లు తెలియుచున్నది.

విద్యాసాగర పాండ్యా, యం. యల్. ఏ గారు మద్రాసునుండి రేపు రాత్రి బొంబాయి మార్గమున ఢిల్లీకి వెళ్లెదరు.

సర్ మిర్జా, ఇస్మాయిలు, మైసూరు దివానుగారు నిన్న రాత్రి బెంగుళూరుకు వెళ్లిరి.

లెఫ్టినెంటు కలనల్ హింగ్ స్టన్ గారు నేటిఉదయమున గ్రాండుట్రంకు ఎక్స్‌ప్రెస్‌నందు ఢిల్లీకి వెళ్లిరి.

యం. ఏ. ముత్తయ్యచెట్టిగారు నిన్న రాత్రి రాజమహేంద్రవరమునకును, హెచ్. ఏ. బి. వర్మగారు శాలంపేటకును డాక్టర్ కేమ్సు హెచ్. కజిన్సుగారు బొంబాయికిని వెళ్లిరి.

## చిత్తూరు డి॥ ము॥ కోర్టులో

O. S. 325/26. E P. 110/29

Between —

వాది:—అన్నయ్యశెట్టి,

And

ప్రతివాదులు:—మునియప్ప వగైరా.

### నోటీసు

వాది ప్రతివాదులపై అమీనా డిక్రీ పొంది అములు జరుపుయించడములో 4 వ ప్రతివాది వెంకటప్పకుగాను వేలం నోటీసుకు వాయిదా 15-1-30 తేదీ వేసియున్నది. సదరి వాయిదాదినం కోర్టుకు హాజరుకాలేనందున ఉత్తరువు అగునని సంగతి యిందువల్ల తెలియచేయుడమైనది.

చిత్తూరు
5-1-30

సి. మునుసామిశెట్టి,
వకీలు, చిత్తూరు



## సమిష్టి శాసనోల్లంఘనము కాకున్న వ్యక్తిశాసనోల్లంఘనము

### మహాత్ముని భావికర్తవ్యముగూర్చి చెప్పుట

### లాంఛుకేబిలు సభవంటి సభ జరుగక తప్పదు

అహమ్మదాబాదు, జన 9:—వెన్నుచూపకుండ ప్రాణములకు తెగించి చివరవరకు పోరాడవలసిన సమయము రాక తప్పదు. కాంగ్రెసు సభ్యులలో పెక్కుండ్రు ప్రస్తుత పైఖరియు, మన అంతఃకలహములు సాంఘిక పరిస్థితి యిటులుండ సటులు తరమగు నిర్మాణ కార్యవిధానము కనుగొనుట కష్టము ఇట్టిసమయమున కాంగ్రెసు పేరిట శాసనోల్లంఘనము జరుపుటకు వీలుండదు. కాంగ్రెసు ముద్రలేక యే ప్రత్యేక వ్యక్తిశాసనోల్లంఘనము జరిపించవలెనని చెప్పుదు. ఇప్పుడు మట్టుకు ఏమిచెప్పుటకును వీలులేదు. అంతయు ప్రారంభదశయందున్నది" అని గాంధిగారు యంగు ఇండియా పత్రికలో కాంగ్రెసు నిర్ణయముల విమర్శించుచు వ్రాసిరి. మరియు యిట్లు వ్రాసిరి "ఆదుర్దాగల దేశభక్తులకు నేనిప్పుడు దేనిని ఆచరణయోగ్యమగు విధానము కనుగొనుటకై నేను సావధానతతో యోచించుచున్నానని మాత్రము తెలుపగలను. దౌర్జన్యరహితమగు శాంతిని పెంపొందించుటకును, నిర్మాణకార్యక్రమము కొనసాగించుటకును ప్రయత్నించినచో వారు నాకు సహాయము చేసినవారగుదురు.

ప్రత్యేకముగా ప్రయోజనములకై బార్డోలిలోవలె కేవలము జరుపు శాసనోల్లంఘనములకై నిర్మాణకార్యక్రమ నిర్వహణమంత ఆవశ్యకము గాకపోయినను, స్వరాజ్యమువంటి అనిర్వచనీయమగు ప్రయోజనముకై జరుపు శాసనోల్లంఘనమునకు నిర్మాణకార్యక్రమ నిర్వహణము అత్యావశ్యకము. ప్రజలు తమ శిక్షణ యందవలెను.

"ఏదోయొక విధానముగూర్చి యోచించుటకుగాక పరిపూర్ణ స్వాతంత్ర్య ప్రభుత్వవిధానముగూర్చి యోచించుటకే కాంగ్రెసువారిని బ్రిటిషుప్రభుత్వమువారు రావ్వానించి, అట్టి సభకు అవసరమగు యితర షరతుల కంగీకరించినచో, కాంగ్రెసు నాయకులు తప్పక ఆహ్వానము నంగీకరింతురనియే నేను భావింతును. ఎప్పుడో యొకప్పుడు ఒక సభ జరుగకతప్పదు. ఆ సమయము దూరముగనుండునా దగ్గరయగునా యనునది మనము, యీ సంవత్సరము మనము చేయు కృషిపైబట్టి యుండును. (ఆం. ప్ర.)

## ఆంధ్రవిశ్వవిద్యాలయము

### 1930 ఏప్రిలులో జరుగు బి. ఏ. పరీక్షకు సంబంధించిన ప్రకటన

ఆంధ్రవిశ్వవిద్యాలయమువారిచే 1930 ఏప్రిలులో జరుపబడు బి. ఏ. పట్టపరీక్షాభాగములను గ్రూపు (2 సి) ఫిజిక్సు (2 బి) యొక్క ప్రత్యేక పరిశోధనభాగ పరీక్ష ప్రాక్టికలు పరీక్ష) జరుగుటకు అనంతపురం దత్తమండల కాలేజీమాత్ర మొక పరీక్షాస్థలముగా నియామకమైనందున ఈ గ్రూపులకు సంబంధించినవారు అనంతపురము దత్తమండల కాలేజీ యందు సిద్ధాంత పరీక్షలు (అనగా థియరీ పరీక్షలు) కూర్చొను అభ్యర్థులెల్లరకు, ప్రాక్టికలు పరీక్ష అనంతపురము కాలేజీయందు జరుగును—కాకినాడ, గుంటూరు, మచిలీపట్టణము, రాజమహేంద్రవరము, విజయనగరం, యీస్థలములందలి అభ్యర్థులు విజయనగరం, మహారాజాగారి కళాశాలయందు ప్రాక్టికలు పరీక్షకు కూర్చొనవలెను అని రిజిస్ట్రారుగారు ప్రకటించుచున్నారు.

# విదేశవార్తలు

## లాహోరుకాంగ్రెస్

ఆహ్వానసంఘాధ్యక్షుని ఉపన్యాసము

అధికారులు శిక్షించుటకు పర్యాలోచించుచున్నారట

డెయిలీటెలిగ్రాపుపత్రికావిలేఖరి ప్రకటనము

(బీము సర్వీసు)

లండన్, జనవరి 7:—లాహోరులో జరిగిన కాంగ్రెసు ఆహ్వానసంఘాధ్యక్షులగు డాక్టరు కిచులూగారి ఉపన్యాసము చాల ఆక్షేపణీయమని డెయిలీ టెలిగ్రాపుపత్రికా ప్రత్యేక విలేఖరి లాహోరునుండి ఆ పత్రికకు వ్రాసెను. ఈపత్రిక హాత్యలను బలిగొల్పు డాక్టరు కిచులూగారి యుపన్యాస మను శీర్షికతో ఒకతంతిని ప్రకటించెను. తన కందిన ప్రత్యేకతంతి ప్రకారము అధికారులీ యుపన్యాసమునుగూర్చి తగినచర్యను దీసికొని కిచులూగారిపై నేరమును ఆరోపించుటకు ఆలోచించుచున్నారని తెలియుచున్న దనుచున్నది. భారతీయులు స్వాతంత్ర్యము తమ ఆదర్శమని ప్రకటించుటవల్లను ప్రభుత్వము వారు అరికట్ట దలంపరులేదు. కాన, వారట్టి తలంపుతో అవగాశిక్షించుటకు ఆలోచించుటలేదని తెలియుచున్నదని ప్రీప్రెస్ విలేఖరి విచారించి తెలుపుచున్నాడు.

## లాహోరు కాంగ్రెసు తీర్మానము

ఢిల్లీ రైలుపై బాంబుపడుట

నిర్బంధవిధాన వదంతులు

[బీము సర్వీసు]

లండన్, జన 7:—రాజప్రతినిధి రైలుమీద బాంబు పడిన వెంటనే లాహోరు కాంగ్రెసు తీర్మానములు జరుగట యు అడ్డానంటేసి నిర్బంధవిధానమును సాగించెదరని అనేకులో ఏమి అనరోకాని ఇపుడట్టి సంగతి జరుగదని ఇర్విను ప్రభువు ఏమిచేయదలచుకొన్న దానిని ఆమోదించుటయే కార్మిక ప్రభుత్వమువారి సంకల్పము అందులకు తయారుగ నున్నారు. ఎవరేమి సలహా నిచ్చినను కారణము లేకుండ నిర్బంధవిధానము గడంగడనియు నిదానముగల రాజనీతిజ్ఞుడనియు కార్మిక ప్రభుత్వమువారి నమ్మకము. ఈపద్ధతినే ప్రభుత్వమువారు అవలంబించెదరని తెలిసినవారు ప్రీప్రెస్ విలేఖరితో చెప్పిరట. సైనికశాసనమును ప్రకటించెదరా యని యడుగ ఇండియా ప్రభుత్వము అవసరమున్నచో అటులనే చేసెద మనిరట.

స్త్రీలు, పిల్లలు అపాయమందు న్నారని అపుడే ప్రతిపక్షులు గోలచేయు చున్నారు. ఇండియా ప్రభుత్వమువారేమి చేయవలెనని మమ్ములను గోరినను వారు పరిస్థితులను ప్రత్యక్షముగ జూచువారుగాన వారి ఇష్టము వచ్చినట్లు సాగించెదమని ప్రభుత్వమువారు చూచుచున్నారు. కాని అదృష్టవశమున ఇర్వినుప్రభు విపుడు రాజ్యాధికారిగనున్నాడని సంతసించుచున్నారు.

## బెంగాలు ప్రభుత్వమువారు

"ఎట్టి అవసరపరిస్థితులు ఏర్పడినను తగిన చర్యను దీసికొనుటకు సిద్ధముగ నున్నారు"

డెయిలీ హెరాల్డుపత్రిక

(బీము సర్వీసు)

లండన్, జనవరి 7:—ఎట్టి అవసరపరిస్థితులు ఏర్పడినను లేక తొందరగలిగినను దానిని అణచుటకు బెంగాలు ప్రభుత్వమువారు సంసిద్ధులై యున్నారని డెయిలీ హెరాల్డుపత్రిక ప్రత్యేకవిలేఖరి తెలుపుచున్నాడు. వాటికేర్పాటులను హెచ్చరించిరట. సహాయసైన్యము సిద్ధముగ నుండునని ప్రభుత్వమువారు వారికి తెలిపిరట.

## రస్సెలు ప్రభువు

'నిరాకరణము అనుకున్నదే'

[బీముసర్వీసు]

లండన్, జనవరి 7:—ఇండియా సహాయమంత్రి నిరాకరణము అనగా భారతదేశమునకు ఇప్పుడు గాగుగరా చాలకాలమయిన పిదపగూడ డొమినియను ప్రభుత్వము సిద్ధించుననిను లేదని రూటరుతో తెలుపుటలో ఆశ్చర్యము లేదనుచున్నారు. ఈ యుపన్యాసమును కార్మికపక్షము తరపున కేంబ్రిడ్జిషైరులో జేసిరి. డెయిలీహెరాల్డులో గాని టైమ్సుపత్రికలో గాని దీనిని ప్రకటించలేదు. కాని డెయిలీ మెయిలు పత్రము ఇట్లు తెలుపుచున్నది—"రస్సెలుగారు మన్హుకొన్న ప్రభుత్వము సిపాయిలచే విచారగ్రస్తులయిరి. అందుచే ఉపన్యాసము తయారు చేసుకొనిరాలేరు." కాని ఆ సమయమునందే ఇంకొక ప్రకటనము వెలువడెను. రస్సెలు ప్రభువు 1929 అక్టోబరు 31 తేదీని గావించిన రాజప్రతినిధి ప్రకటనమును అంగీకరించుచున్నాడ ననిరి. మహాత్మగాంధిగారి సహాయనిరాకరణమునకు చింతిలుచున్నాడ ననిరి. ఈలోపుగ ఇట్టి యుపన్యాసము రాజప్రతినిధి ప్రకటనము నకు మందిచ్చిన బాగుండెడిదని ఈవినింగు స్టాండర్డు పత్రిక ప్రకటించెను. ఈ ప్రకటనలు ఇట్లు పరస్పరవిరుద్ధముగ నుండుటచే ప్రీప్రెస్ విలేఖరి రస్సెలు ప్రభువు నిజముగా కార్మిక ప్రభుత్వ విధానమునే తెలుపుచున్నారాయని ఇండియా కార్యాలయమువారినడుగ ఈ ప్రకటనలన్నియు సరి అయినవి గావనియు, బెన్నగారును, రస్సెలుగారును ఇద్దరును పట్టణములో లేకపోవుటచే అధికారముతో గూడుకొన్న ప్రకటనమును గావింప వీలులేదని తెలిపిరట. రస్సెలుగారు భారతదేశములో శిబరల్సు నుద్దేశించి మాట్లాడిరనియు కాని ఆ ఉపన్యాసవివరములు లభించుట లేదని తెలియుచున్నది.

## రస్సెలు ప్రభువుగారి సంపూర్ణోపన్యాసము

ఈవినింగు స్టాండర్డు పత్రిక ఇట్లు ప్రకటించుచున్నది. "లాహోరు కాంగ్రెసులో గావించిన స్వాతంత్ర్య తీర్మానములు సాహసముతో గూడుకొన్నవే కాని అవివేకపు మాటలు. ఈతరుణమందు సంపూర్ణస్వాతంత్ర్యము సాధ్యము గాదని భారతీయులకే అందరికంటె ఎక్కువ బాగుగ తెలియును. డొమినియను ప్రభుత్వము, సంపూర్ణ స్వాతంత్ర్యమునకు అంత వ్యత్యాసములేదు. అది సమయమున సాధ్యముగాదు. మీరు భారతదేశమును పెంచి పోషించుచున్నపుడు అకస్మికముగ మీ సహాయమును విడనాడి మీవ్యవహారములను మీరే జూచుకొనుడు అని చెప్పజాలరు. తమంతటతాము నిర్వహించుటకు కొంత కాలముపట్టును."

మరియు రస్సెలుప్రభువు ఇట్లు తెలుపుచున్నారు:—కార్మిక ప్రభుత్వమువారు మొదట అధికారమును స్వీకరించినపుడు వారి కీకష్టమే తోచెను "వారికేది కావలెనో వారెరుగుదురు" బ్రిటను అకస్మికముగ వదలుకొనిపోవుచో ఇండియాలో జాతిద్వేషములు, మతమునుగూర్చి భిన్నాభిప్రాయములుండుటచే జయింపలేని కష్టము లేర్పడును. అపుడు భారతీయులు తమ వ్యవహారములను నిర్వహించుకొనజాలరు.

"భారత సామ్రాజ్యములో నున్న ఇంత పాలితులను నిరుత్సాహ పరచకుండ భారతీయులు ఇంకను పనుప నేర్పాటుగాలేదు. వారు పరుగెత్తగల్గుటకు ఇంకను కొంతకాలము పట్టును." కార్మిక ప్రభుత్వమువారు త్రికరణశుద్ధిగ భారతీయులకు స్వపరిపాలనము నీయవలెనని సంకల్పించుకొన్నారు. కాని ఇట్టి అవివేకపు తీర్మానములవే (స్వాతంత్ర్య తీర్మానములు) వారట్లు చేయుటకు సహాయమును చేయవైరి. ఈతీర్మానముల ధోరణికి భారత దేశమునకు నిజమగు మిత్రులందరును విచారింపక మానరు. తొందరపడిన కార్యములు కారాదనిరి.

ఈ అవివేకపు తీర్మానములచే ఇండియా కార్యాలయమునందున్న నా యజమాని భయపడువారు గాడు. అయన పనికి అడ్డురారు.

### రస్సెలు ప్రభుని ఆశ్చర్యము

క్యేంబ్రిడ్జిలో తన యుపన్యాసమును అందరును ఆక్షేపించి వంకలను రూటరుతో రస్సెలుగారు తమ యాశ్చర్యమును తెలిపిరి. తన యుపన్యాససంగ్రహమును అతిసంగ్రహముగ ప్రకటించుటనియు, చాల అనుమానములకు కారణమగుచున్నదనియు తెలిపెను. తానిచ్చిన ఉపన్యాసమును పూర్తిగ ప్రకటించుచో ఇంగ్లండు ఇండియాక్షేమమునిమిత్తమే తాను సహకారము నపేక్షించుచుంటినని తన శ్రోతలకుగూడ స్పష్టమగుననుచున్నాడు. భారతదేశపరిస్థితులను గ్రహించుటకు వ్యవధిలేని బ్రిటిషువారికొరకే భారతదేశపరిస్థితులను, తన యుపన్యాసమున తెలిపితి ననిరి.

డొమినియను ప్రభుత్వము చాలకాలమునకు వీలులేదని తాను చెప్పలేదనెను. ప్రజాస్వామ్యసంస్థలు తమ దేశములో నే సంపూర్ణముగ ఏర్పడుటకు దీర్ఘకాలము పట్టెననియు నేటికిగూడ పరిపక్వముగాంచలేదంటి ననియు తెలిపెను. భారతీయుల సహకారమున్నచో అందరి బాగుకొఱకును కార్యరూపమునకు దాల్పగల విధానమును తయారు చేయగలమంటినని తెలిపెను. ఈవిషయమై కార్మికపక్షమువారు పూర్తిగ త్రికరణశుద్ధిని జూపుచున్నారనెను. ఈ తప్పుప్రకటనమువలన తనస్నేహితులు తప్పువారిని త్రొక్కకుందురుగాక యనియు, భారతదేశీయమహాజనసభ పైభరిని, టోరీలపైకినిని విచారించుచున్నాడ ననిరి. ప్రస్తుత మీ కష్టములన్నిటిని టోరీపత్రికలే తెచ్చిపెట్టుచున్నారనిరి. ఇండియాకు ఇర్వినుప్రభునికంటె వేరు ఆత్మమిత్రుడు లేడు. గాన భారతీయులందరును ఇర్వినుప్రభునిమాటల నంగీకరించెదరుగాక యనెను.

## భారతదేశపరిస్థితులు

బ్రిటిషుపత్రికలు

(బీముసర్వీసు)

లండన్, జనవరి 7:—భారతదేశపరిస్థితులను బ్రిటిషు పత్రికలు ఇంకను చర్చించుచేయున్నవి. ఇండియానుండి లండను టైమ్సునకిట్లు ప్రత్యేకతంతి వెనరో బంపిరట—డిశంబరు 23 తేదీని రాజప్రతినిధితో భారతనాయకులు సంప్రతించగోరిరి. ఇర్వినుప్రభువునుండి వరముల బడయగోరిరి. రాజప్రతినిధి వీరికి లోబడి సంధిచేసుకొనుచున్నాడను అపవాదమును తెచ్చిపెట్టుటకు బూనుకొనిరి.

డెయిలీన్యూసుపత్రిక ఇట్లు వ్రాయుచున్నది:—కాంగ్రెసువారులు మాటలుచేర్చిన రాజ్యాంగచేష్టలు. భారతపత్రికలన్నియు వీరి వశములో నున్నవి. తీవ్రముగ, దానివలన ఆందోళనము గావించుచున్నారు. శాసనసభల బహిష్కారము, పన్నుల నిరాకరణము అనుష్ఠించుచో దానివలన భయోత్పాతమును ఫలితము లేర్పడునను కొనుట యుక్తి యుక్తమైనదనము.

మార్నింగుపోస్టుపత్రిక ఇట్లు తెలుపుచున్నది:—భారతదేశీయ మహాజనసభవారు తమ తీర్మానములను అనుష్ఠించవలెనని బ్రిటను ఇండియాను విడిచిపెట్టి పోవలసివచ్చును. శిక్కులు ఎల్లపుడు అల్లరులకు దోపిళ్లకు పంసిద్ధుల అధికారులు గ్రహింపవలెను. తాము ఒకప్పుడు పంజాబుపాలకుల మని వారు మరచి జాలరు. బ్రిటిషువారు హిందువులకు భయపడుచున్నారని ముసల్మానులు గూడ తాము ప్రభుత్వముతో సహకారము సల్పుటకు షరతులను గోరుచున్నారు. స్వరాజ్యపరిపాలనము స్థాపించు కాంగ్రెసువాదులస్వేచ్ఛాప్రవృత్తిని ప్రశంసించుటకు ముందు వేన్నగారు అరాచకమువలన కలుగు ఫలితమును ఆలోచింపవలెను.

ఏవిఘ టైమ్సుపత్రిక ఇట్లు వ్రాయుచున్నది:—సైమను కమిషనును బ్రిటిషుప్రభుత్వమువారు గన్నుచేయవలెను. ఇంతవరకు ఇండియాకువచ్చిన సంస్కారణములను ఆపివేయవలెను. భారతదేశమును కఠినముగా పాలించవలెను.

## భారతదేశీయ మహాజనసభ

మెస్టన్ ప్రభువు

(బీము సర్వీసు)

లండన్, జనవరి 7:—మెస్టన్ ప్రభువు పత్రికాప్రతినిధితో ఇట్లుతెలిపెను:—భారతదేశీయమహాజనసభకు ప్రజలలో పలుకుబడి అపారము. బ్రిటను ప్రత్యుత్తరమిచ్చి ప్రతీకారము అరయవలసిన సమయ మేర్పడినది. ఎంతకష్టముగ నున్నను ఇండియాలో అధికారము తన కార్యభారమును నిర్వహించగలదని ఆశించుచున్నాడను. కాని సైన్యాధికారము వీరికి తోడ్పడవలెను. తోడ్పడిన ఇండియాఅధికారులు సాధించగలరు. ప్రజలకు అంగీకారముకానిచో నీసముగ కాంగ్రెసువాదులు కోరరాదని సందియపడుచున్నాడను. భారతీయులలో ఒకలోపమున్నది. అనుకొన్నదానికంటె ఎక్కువ అడుగుట ప్రాచ్యుల అలవాటయినది.

# భూమిపన్ను విధాన సంస్కరణము

మొదటిభాగము

రా. మంజేశ్వరశర్మగారు

ఈవ్యాసము మూడుభాగములుగా విభజించెదను. (1) ప్రస్తుతవిధానము దానిలోపములు (2) దీని నేవిధముగా సంస్కరింపవలెను (3) దీనిని శాసనసభవారి పరముచేయుట.

ప్రస్తుత విధానము

ప్రస్తుతవిధానము ఈదేశములో ప్రాచీనకాలమునుండి ప్రభుత్వమునకు భూమిపంటలో ఒకభాగమునకు హక్కు కలదను, అసత్యసిద్ధాంతముపై నిర్మింపబడియున్నది. ప్రాచీన స్మృతి శాస్త్రైన, మనువు, పరాశర గౌతమ ధర్మసూత్రముల ప్రకారము పండినపంటలో "మూలధనముకంటె నధికమైన" నికరములో 6 మొదలు 12వ వంతువరకున్ను మాత్రము పన్నుకు అధికారముండినది పైగా ఈపన్ను ప్రజల అంగీకారముపై ఏర్పడినట్లున్ను, (చూ. మహాభారతము శాంతిపర్వము) ప్రజారక్షణార్థము (చూ. గౌతమ ధర్మసూత్రములు) మాత్రమే వసూలు చేయుటకు రాజున కధికారముండినట్లున్ను కూడ కనబడుచున్నది. ఇందునుగూర్చి విపులముగా తెలిసికొనగోరువారు రివిన్యూమెంబరుగారికి అంగ్లమున నేను వ్రాసిన బహిరంగలేఖలు చూడవలెను.

పైలక్షణములనుబట్టి చూచిన, ప్రస్తుత రివిన్యూ విధానమునకు శరణ్యములేదు ప్రజాంగీకారమా ఈప్రభుత్వమునకు లేదు. ప్రస్తుతము వసూలుచేయబడు పన్ను రైతుకు పంటలో మిగిలిన నికరలాభములో నుంచిగాదు వసూలుచేయబడుచున్నది. అది ప్రతి 30 సం॥రంలకున్ను, ధరలు హెచ్చినవనియు కొల్లు సక్రమము హెచ్చినవనియు, కారణముల నారోపించి, తిర్గి హెచ్చింపబడుచున్నవి.

ఆధునిక నాగరకపన్నుల సిద్ధాంతములబట్టి ప్రస్తుత రివిన్యూ విధానము యొక్క సభ్యతను గూర్చి యోచించెదము:—ప్రతిమానవుడు సంఘముయొక్క క్షేమము నకై యేర్పడిన "ప్రభుత్వమునకు" ఒక సంఘమునకు తన సమర్థత కొలదియు, విధిగా చెల్లింపవలసిన కట్నమును "పన్ను" అని నిర్వచించిరి. అట్టిపన్ను ప్రజలకు ప్రాతినిధ్యము వహించు శాసనసభయొక్క అంగీకారముపై విధింపబడవలెను. ప్రస్తుత ప్రభుత్వము ప్రజాక్షేమమున కేర్పడినదా? అను అంశమునుగూర్చి విచారణ అప్రస్తుతము 1. ఈకట్నము నిచ్చుటలో నిచ్చువాని సమర్థత 2. ఇచ్చువాని సౌకర్యము 3 సాధ్యమైనంత తక్కువ తగులుబడితో వసూలుచేయుట 4 పన్ను విధించుటకు గల కారణములగూర్చి స్పష్టాభిప్రాయములు ఈ లక్షణములు పట్టవలెను.

1. సమర్థత—ప్రస్తుత రివిన్యూ విధానము, భూస్వామియొక్క సమర్థతను బట్టిలేదు. నిజముగా నీ ప్రభుత్వములో జమీందారులకున్ను, పెద్దరాబడిగల వర్తకులకున్ను, రక్షణ కావలసియున్నది. కాని జమీందార్లకు, 128 సం॥రం క్రితం కట్టబడిన స్వల్ప పేష్కషు స్థిరముచేయబడినది. వర్తకులకు రెండు వేల రూపాయలు లాభమునకు పై బడినగాని పన్ను లేదు. అదియు రూపాయకు 5 పైసలు. విదేశవస్తువులను తన దేశమునందు చి వేసి, అమితలాభముల గానున్న విదేశవర్తకులపైనను, వారి వస్తువులపైనను కూడ పన్ను బహు స్వల్పము. కాని సాలు పొడుగునా చెమట యోడ్చి భూమి దున్నెడు స్వల్పభూస్వాములే అధికభాగ్యకులుగాగల వ్యవసాయవృత్తిపైన, ప్రతి సెంటుభూమికి రూపాయికి అర్ధచొప్పున పన్ను. ఈ విధముగా వీరివల్ల సాలుకు 34 కోట్లు వసూలగుచున్నది. ఈవృత్తి, ఈ రయితుల యొక్క యున్నతక్షేమమున కీప్రభుత్వము ఖర్చుపెట్టినది బహుస్వల్పము. ఇంతేకాక వీరిపై నీటితీరువాయి కూడ వసూలుచేయబడి సర్కారు లాభముకూడ తీయును.

2. ఇచ్చువాని సౌకర్యము:—ఈపన్ను వసూలుచేయు, జనవరి ఫిబ్రవరి, మార్చి నెలలలో ధాన్యములకు అతిస్వల్పధర లుంటవల్ల రయితులకు ఇంతనష్టము. ఇక ప్రతిముప్పది సం॥రంలకు సర్వే, రీసెటిల్మెంటులలో ఈనోరులేని ప్రజలకు బాధలు, వర్ణనాతీతములు ప్రజాశాశ్వత కాని సెటిల్మెంట్లుఆఫీసర్లువారి క్రింది ఉద్యోగులుచేయు అక్రమములు బార్డోలీ వెల్లడించినది. వీరి విచారణను పరీక్షించుటకు ప్రజాప్రతినిధులకు శాసనబద్ధమైన హక్కు లేదు.

3. సాధ్యమైనంత తక్కువ తగులుబడితో ఈపన్ను వసూలుచేయుట.—

ఈలక్షణము ఈవిధానమున కసలే పట్టలేదు. ప్రతి రీసెటిల్మెంటులోను, ఒకజిల్లాపైన హెచ్చింపబడు పన్నులో మూడుకాల్లు సం॥రం అధికభాగ పన్ను సెటిల్మెంటు డిపార్టుమెంటు ఖర్చులక్రింద సరిపోవును. కృష్ణాగోదావరులలో సెటిల్మెంటు ఆఫీసరు హెచ్చింపదలచిన పన్ను సాలుకు 13 లక్షలలో సర్వే సెటిల్మెంటు ఖర్చులు ఇప్పటికి 28 లక్షలయినవి. పైగా రివిన్యూ డిపార్టుమెంటువారు రయితులవల్ల పన్ను రాబట్టుటలో చూపెడు అదర్శనీయమైన, చాకచక్యము, శ్రద్ధ రైతు క్షేమమునకై వీరుచేయవలసిన కార్యములలో నున్న పైగా ప్రజలను అధికార్లు లంచములకై పీడించుట కిది మంచి తరుణము.

4 వ కారణము:—ఈపన్ను వసూలుచేయు రివిన్యూ విధానము, శాస్త్ర సిద్ధమైన హేతువులపై నిర్ణయింపబడలేదు. గింజలధరలనుబట్టి యేనాగరక, ప్రభుత్వములోను పన్నుకట్టరు. ధరలు విదేశపు సరుకుల యెగుమతి, దిగుమతులు, పంటలు, నాగకపుధరలు స్వదేశములలోని, నాణెములలోనున్న, వెండి బంగారు ధరలు ఇన్ని అంశములపై హెచ్చుచు, తగ్గుచునుండును. కొల్పనిస్తులనుబట్టి వ్యవసాయలాభముల నూహించుట అక్రమమని బార్డోలీ విచారణ ఋజువుచేసినది.

నేడు సర్వనాగరకదేశములలోను, కృషీవలునకు, పండిన పంటలో ఖర్చులున్ను, సామాన్యమైన అతని నిత్యకుటుంబఖర్చులున్ను, పోను మిగిలిన ఆదాయమునపైన నీ పన్ను విధించెదరు. రాబడి హెచ్చినకొలదియు పన్నురేటు హెచ్చించెదరు. మూడు రూపాయలు ఆదాయముపైన, ఐదురూపాయలున్ను, నాలుగు వందల రూపాయలపైన, అయిదవవంతు యేడురూపాయలు పన్నువాబరువేసిన సిద్ధాంత మెల్లెడల నేడు అంగీకరింపబడుచున్నది.

పైగా ఈ సెటిల్మెంటువిధానము దేశపు సంఘీభావమునకు వ్యతిరేకముగానుండి సంకుచితమైన స్వార్థపరత్వమును పురికొల్పుచున్నది. తంజావూరునకు రీసెటిల్మెంటు వచ్చినప్పుడు "మా భూములు కృష్ణాగోదావరుల ఫలవంతములు గావని" తంజావూరువారు చెప్పుదురు. గోదావరివారు "కావేరీమండలి" వంటివి భూములులేవని తెలుపుదురు. ఒకజిల్లా రీసెటిల్మెంటు వచ్చినప్పుడు రెండవజిల్లావారు తమదికానట్లు ఊరుకొందురు. ఇక ప్రభుత్వమన్ననో జిల్లాలలోని ఈ భిన్నదృష్టి నవకాశముగా చేసికొని అందోళనలేని దత్తమండలవాసులు అధికముగ కరుదీనులైన వారిపై తడిసిమోపెడు పన్ను కట్టుచు, బార్డోలీ, తంజావూరు, కృష్ణాగోదావరులవారిని, హెచ్చిన రు 0-6-0 లలో రు 0-5-0 తగ్గించి ఒకరిని, రు 3-0-0 లలో రు 0-1-0 తగ్గించి ఒకరిని, కమిటీ యేర్పరచి మరియొకరిని వారివారి అందోళన బలానుసారం తమవిధానములకు భంగము రాకుండ వీరెంత రాబట్టుకొనుచున్నారు.

## భూమిపన్ను విధాన మెట్లు మారవలెను?

సర్వవిధములను నీ అనాగరకమై, దేశమున కరిష్టదాయకమై, వ్యవసాయవృత్తియొక్క, వినాశమున కసలోభమైన, నీవిధానము మారవలసియున్నది. ఇది యెట్లు మారవలెను? ఇది యే గొప్పసమస్య. గింజలు ధరలు, భూముల క్రయములు, కొల్లలో నిశిస్తులనుబట్టి భూమిపన్ను యేర్పడుటగాని, హెచ్చించుటగాని జరుగరాదు. ఇతర నాగరకదేశములలోని పన్నుల సూత్రములు వీనిని ప్రత్యేకకారణములుగా గైకొనుట లేదు. భారత రయితుయొక్క మానసికతత్వమును, వాని ఆర్థిక సాంఘికపరిస్థితియు తెలుసుకొన్నప్పుడు, పై కొవుర్లు, ధరలు మున్నవానిని కారణములుగా గైకొనుటలోని అవివేకము విదితమగును. మన రైతుయొక్క మానసిక తత్వమెద్ది? స్వాభావికముగా జగస్త్రమిథ్య అను తత్వ మతనిది అందుచేత ద్రవ్యకాంక్షయు, వ్యవహారిక ప్రయుక్తులు పాశ్చాత్యదేశమునందు వలె లేవు. వృత్తులన్నిటిలోనికెల్ల, అమాయకమున్ను, పోటీభావము తక్కువగల వృత్తి వ్యవసాయము. విజనమున్ను, స్వాభావిక ఆహారవిహారముల కనువైనది పల్లెటూరు. మన్వంతరము నుంచి అతని రక్తములో జీర్ణమైన వృత్తి వ్యవసాయము. భూమి "స్థిరవసతి" అని అతని నమ్మకము. తన డబ్బుపైన వడ్డీకి యిచ్చినప్పుడు రు 1-0-0 కిట్టినను సరి అ 0-4-0 కిట్టక పోయినను భూమిపైననే పెట్టును. (ఒకవేళ పట్టమని రయితాంగము అంతా భూములమ్మితే కొనేవారెవరు?) పర్ణాభిమానము, కులాభిమానముల్ల అతను అంగ్లేయునివలె చెప్పులు కట్టుట మొదలు మంత్రిత్వమువరకున్ను గల అన్నివృత్తులున్ను అభేదములను భావము అంగీకరింపడు. పైగా యితరవృత్తులు కూడ నీదేశములో లేవు. భారతరయితు వ్యవసాయమునందు మమకారముగలుగుటకు కారణము అవృత్తి ఆర్థికముగా నతనికి లభించుటచేత వను సాంఘిక నిర్ణయము చేయుటకుముందు ఈ అంశములన్నియు యోచింపవలెను. ఇట్టి యోచన చేసి పై అంశములు పండినను యెండినను, భూస్వాములు మక్తాలు హెచ్చుచేసినను, అతను వ్యవసాయములో పొదుకొని పోవుట కెట్లు కారణభూతమయ్యెనో తెలుసుకొనినప్పుడు ధరలు, హెచ్చినను, తగ్గినను వ్యవసాయమును అతడు విడువడని స్పష్టపడును. ఈ యదార్థదృక్పథముపై రివిన్యూ విధానము సవరణ కావలెను. ఆదాయము తగ్గినప్పుడు పాశ్చాత్యదేశములలో వివాహములు తగ్గును. కాని భారతరయితుకు వివాహము మతవిధి. పాశ్చాత్య ఆర్థికశాస్త్రములలో హెచ్చు వివాహములు అనగా హెచ్చుఆదాయములు వచ్చుచున్నవని ఊహింపవచ్చును. కాని భారతదేశమున కట్టి ఊహ కవకాశములేదు. ఈ అంశములు పోల్చుటను మన్నరువారు అంగీకరించియున్నారు. (ఎలిమెంట్సు ఆఫ్ ఇండియన్ టాక్సేషన్ ఆఫ్ అల్సుటన్.) చూ. కృష్ణాగోదావరిజిల్లా సెటిల్మెంటు స్కీము రిపోర్టు ఈ విషయమున పూర్ణముగా లోపభూయిష్టమై యున్నది.

రైతుభూమిగాక వారి ఆర్థికస్థితియే పన్నుకట్టుటలో ప్రధానాంశముగా నుండవలెను అను సూత్ర మిప్పు డంగీకరింపక తప్పదు. ఈ పన్ను విధించు అధికారము శాసనసభలకు వశమగ్నుట. ఇవియే నేడు దేశములోని సర్వనాయకులు అంగీకరించియున్నారు. నీ ప్రధానసూత్రములకు లోబడి యింతవరకు దేశములో బయలుదేరిన సూచనల నిట దేశీయులయోచనకై సొందుపరచుచున్నాను.

(1) 1925 సం॥ రం॥ పన్నులవిచారణసంఘమువారి—సాలుసరి నికరాదాయముపై నూటికి 25 వంతున భూమిపన్ను రాష్ట్రప్రభుత్వమువారు స్థిరపర్చవలెను అంతకుపైన అవసరమైనచో విధింపబడు పన్ను స్థానికసంస్థలకు చెందవలెను. హెచ్చు ఆదాయములపైన ఆదాయపుపన్నుగాని, వారసత్వపు పన్నుగాని విధించవలెను.

హాబ్లిల్లాసంఘమువారి—సెటిల్మెంటువిధానము, ప్రజలకు అక్రమము జరుగకుండునట్లు కట్టుకాట్లతో నిలుపవలెను. స్కీము రిపోర్టు శాసన సభవారి ఆమోదమునకు పెట్టవలెను

3 మరియొక సూచన—ఈ సెటిల్మెంటు రీసెటిల్మెంట్లు వ్యవధి ప్రయాసము అప్పుడేకి 40 లేక 50 సం॥రములకొకసారి నూటికి 10 లేక 12½ రూ॥ కన్న పన్నును హెచ్చు చేయవలెను.

4 "స్వల్పకమతములు" అనునది నిర్వచనము చేసి దానిని భూమిపన్ను బాధ్యతనుండి తప్పించి అంతకు పైబడిన భూమిపైననే పన్ను విధించుట ప్రారంభము కావలెను.

5 భూమియొక్క కిమ్మతునుబట్టి పన్ను విధింపబడవలెను.

6 భూమిపన్ను 3 విధములుగావిధింపబడవలెను. 1 పన్నులసూత్రముల ప్రకారం సామాన్యపుపన్ను 2 భూమి కల్గియున్నందులకున్ను, వ్యవసాయము వృత్తిగాకల్గినందులకున్ను ప్రత్యేకపు పన్ను 3 సెస్సులు పాశ్చాత్యదేశములలో భూములను కౌలు కిచ్చుకొనువారిపై విధింపబడు పన్ను, స్వంతముగా వ్యవసాయము చేసికొనువారిపై పన్నుకంటె తక్కువగా యుండును.

బార్డోలీనాయకులైన సర్దారు పటేలుగారి అధ్యక్షతన యేర్పడిన బొంబాయి భూసమితివారు !(1) భూమికి ప్రభుత్వస్వామ్యసిద్ధాంతమును వదలుకొనవలెననియు (2) వ్యవసాయ లాభములబట్టి పన్ను యేర్పడవలెననియు, సెటిల్మెంటు జరుగునప్పుడు, ఆఫీసర్లకు ప్రజాప్రతినిధులుకూడ చేర్పబడవలెననియు సూచించిరి. భూమి పన్ను ప్రస్తుతమున్నది శాశ్వతము చేయబడవలెనని రమేశచంద్రదత్తుగారి నాటినుంచి వచ్చుచున్న వాదము మరియొకటి. కాని ఆవాదమునకు క్రమముగాబలము తగ్గుచున్నది. జమీందారీలలో ప్రవేశపెట్టబడిన శాశ్వతపన్ను పద్ధతియే ఆర్థికముగా దేశమునకు ప్రతికూలమని నేడు నమ్మబడుచున్నది. పెద్ద భూస్వాములవద్ద ఎప్పటికప్పుడు, "సమర్థతను" బట్టి పన్ను వసూలుచేయబడవలెను. చిన్నవారి గంజిఅన్నములోనుండి పన్ను రాబట్టకుండ కాపాడవలెను. వీరు బాడిఉప్పు మున్నగు పన్నులను చెల్లించుచునేయున్నారు. అదియే మన విధానముగా నుండవలెను.

ఈ విమర్శ నిచ్చట ఆంధ్రులయోచనకుగాను చేసితిని. కాని మనకు ఇపుడు కావలసినది ప్రథమతః ఈ భూమిపన్నుయొక్క నూతన స్వరూపనిర్ణయము కాదు. ఈవిధానపు మార్పుదలయొక్క అవశ్యకతను ప్రభుత్వ మంగీకరించి రయితుల సంఘములవారియొక్కయు ప్రతినిధులయొక్కయు అభిప్రాయములు వాహ్వానించవలెను. వారి యనుమతిపై నిర్మింపబడిన చట్టము శాసనబద్ధము కావలెను. అంతవరకు జరుగుచున్నట్టియు జరుగబోవునట్టియు యేవిధమైన సెటిల్మెంట్లు ఆపుకావలెను. ఇది మన ప్రస్తుత ముఖ్యలక్ష్యము. కాన ప్రస్తుత విధానపుమార్పుదలకై ప్రభుత్వ మంగీకరించినవాడు నూతనవిధానము నిర్మించుట తదనంతరము జరుగును.

రయితుసోదరులారా! మీశక్తిని తెలిసికొనుడు. మీ సంఘశక్తిని ప్రకటించి అందోళన జరిపినగాని ఇట్టిమార్పులు కలుగునని నమ్మకాలను. రిక్తశాస్త్రాభిప్రాయములవలన ప్రయోజనము లేదు. మీరున్ను కేవలము ఈ సెటిల్మెంటులలో, అణాలేక తగ్గింపులకు ఆశపడక ఈ రీసెటిల్మెంటు విషవృక్షముయొక్క మూలభేదమునకు గడంగుడు. ఈ విధానపు మార్పుదలనుగూర్చి నేడు యూనివర్సరత మధనము బయల్వెడలినది. ఈతరుణమును పూర్ణముగా వినియోగించవలసిన కర్తవ్యము రయితులపైనను, దేశనాయకుల పైనను యున్నది.

# సర్ ఆర్. వెంకటరత్నంనాయుడు గారి తైలవర్ణచిత్రపటము

## మద్రాసు విశ్వవిద్యాలయ సెనేటుభవనమందు బహిరంగపరుపబడుట

ఒక విన్నపము

డి॥ బ॥ డా॥ సర్ ఆర్. వెంకటరత్నంనాయుడు గారు వైసు ఛాన్సలరు దుస్తులను ధరించియుండగా తీయబడిన తైలవర్ణచిత్రపటమునొకదానిని మద్రాసు విశ్వవిద్యాలయ సెనేటు భవనమందు బహిరంగపరుప నుద్దేశించియున్నాము. సర్ ఆర్. వెంకటరత్నం నాయుడుగారిని దక్షిణదేశప్రజలు బాగుగా నెరిగియే యున్నారు. వీరు యీ రాజధానిలో అనేకసంవత్సరములనుండియు సంఘసంస్కర్తలుగాను, మతసంస్కర్తలుగాను, విద్యాబోధన ప్రవీణులుగాను ప్రఖ్యాతిగాంచియున్నవారు. ఇట్టి ప్రముఖుని గౌరవించుట తమ మిత్రులయొక్కయు, పూర్వపు విద్యార్థులయొక్కయు, విధియైయున్నది. విశ్వవిద్యాలయమునకు సంబంధించిన సెనేటుముఖ్యసభలో వీరి చిత్రపటము నావిష్కరించి బహిరంగపరచుట కేర్పాట్లు గావింపబడును. ఇందుకు సంబంధించు ఖర్చుల నిమిత్తము చందాలను చెల్లింపగోరువారు రూ 5 లేక 10 లేక 25, ఈ మూడు తరగతులలో నేదనగా నొకదానిగా చెల్లింపవచ్చును. చందాలను సాధ్యమగునంత త్వరలో జనవరి 20 తేదీ లోగా ఆర్గనైజింగు కమిటీ ట్రెజరరు (77, సెల్ఫుగోడ్డు, తిరువళిక్కేణి) వద్ద గాని, లేక, మద్రాసు సెంట్రలు బ్యాంకు (సౌకార్పేట బ్రాంచి, ఆర్మీనియను వీధి)వద్ద గాని పంపగోరుచున్నాము.

ఇట్లు,

ఆర్గనైజింగు కమిటీసభ్యులు.

శ్రీమతి ఏ. ఆర్. లక్ష్మీపతి, బి. ఏ.
గా॥ వి. రామదాసుపంతులు.
శ్రీయుతులు: కె. నాగేశ్వరరావు పంతులు,
,, పి. వి. వెంకటరమణయ్యంగారు బి. ఏ. బి. ఎల్., ఎం. ఎల్. సి. (కోయంబత్తూరు)
,, సి. ఎల్. నరసింహరాజు (విశాఖపట్నం)
,, కె. వెంకటసుబ్బారావునాయుడు (పిఠాపురం)
,, బి. సత్యనారాయణ బి.ఏ.బి.ఎల్., ఎఫ్ ఎం.యు.
,, కె అప్పారావునాయుడు బి. ఏ. బి. ఎల్. (బరంపురం)
,, జి. వెంకయ్య ఎం. ఏ. (గుంటూరు)
,, పి. రామస్వామి ఎం. ఏ. (కాకినాడ)
,, పి. చెంచయ్య, బి. ఏ. ఎం. ఎల్.
,, వి. కామేశ్వరరావు, ఎం. ఏ. ఎం. ఎల్.
శ్రీమతి డా॥ ముత్తులక్ష్మీరెడ్డి, ఎం. ఎల్. సి.
దీ॥ బ॥ జి. నారాయణస్వామి శెట్టి
రా॥ బ॥ డా॥ సి. నటేశముదలియారు
రా॥ బ॥ టి. ఏ. రామలింగంశెట్టియారు (కోయంబత్తూరు)
రా॥ బ॥ సి. వి. పద్మారావు ముదలియారు (సికింద్రాబాదు)
రా॥ సా॥ డా॥ వి. రామకృష్ణారావు (కాకినాడ)
జనాబ్ సయ్యదు బషీరుఅహమ్మదు, ఎం. ఎల్. సి.
శ్రీయుత ఎస్. జగన్నాథరావు నాయుడు, బారిస్టరు (మచిలీపట్నం)
,, ఎం. వి. ఎస్. సుబ్బారావు, ఎం. ఏ (మధుర)
,, కె గంగన్న, బి. ఏ. ఎల్. టి. (రాజమండ్రి)
,, వి. హెచ్. రాఘవరావు, ఎం. ఏ. బి ఎల్.
,, డి. వెంకటరత్నం, యం. యే. బి. యల్.

కార్యదర్శి, కోశాధిపతి.—శ్రీయుత యస్. యస్ పతి, బి. యే. బి. యల్. (77, సెల్ఫుగోడ్డు తిరువళిక్కేణి)

జాయింటు కార్యదర్శి:—శ్రీయుత కె. ఆర్ శాస్త్రి, బి. యే. బి. ఎస్సి, (మచిలీపట్నం) గార్లు.

## విదేశములో వాడే నాణెములపేర్లు

### పౌనులను నాణెములుగా వాడే దేశములు

1. ఇంగ్లండు, వేల్సు అందు స్కాట్లండు 2. ఐర్లండు 3. దక్షిణాఫ్రికా, 4. ఆస్ట్రేలియా, 5 మలాయ రాష్ట్రములు 6. సిలోను, 7. బ్రిటిషు గయానా, 8 కెన్యా, 9. ఆంగ్లో ఈజిప్టు సీడన్, 10 పశ్చిమ యిండియా దీవులు, 11. న్యూజి లండు, 12. ఈజిప్టు, 13 స్విజర్లండు, 14. హాండురస్, 15. అబిసీనియా, 16. ఆఫ్గనిస్థాన్, 17. పర్షియా, 18. పాలస్తైను 19. టర్కీ ఈ దేశములలో వాడు నాణెములకు పౌనులని పేరు.

### డాలర్లను వాడే దేశములు

1. అమెరికా, 2. కనడా, 3. న్యూఫౌండు ల్యాండు అండు లాబ్రడార్, 4. చిల్లి, 5 ఆర్జన్‌టైన్, 6. చైనా దేశములు.

### ఫ్రాంకులు వాడే దేశములు

1. ఫ్రాన్సు, 2. బెల్జియము దేశములు.

### మార్కులు

1. జర్మనీ దేశము

### లైరస్

1. ఇటలీ

### లీవా

1. బల్గేరియా

### క్రౌనులు

1. జెకొస్లొవకియా

### క్రోనర్

1. డెన్మార్కు, 2. నార్వే

### షిల్లింగ్సు

1. ఆస్ట్రియా

### ఎస్కూడొస్

1. పోర్చుగల్

### లై

1. రొమేనియా

### రూబిల్స్

1. రష్యా

### పెసెటస్

1. స్పైన్

### క్రోనార్

1. స్వీడన్

### పియాస్టర్స్

1. క్రీట్

### యెన్లు

1. జపాను

(శ్రీ సు॥)

## ఆంధ్రపత్రిక - భారతి

నిజాంరాష్ట్రమునందలి ఆంధ్రజిల్లాలలో నుండువారికి వి. పి. లు పంపుట సొమ్ము వసూలు చేయుట మొదలగు సౌకర్యములు లేనందున దక్షిణ హైదరాబాదు 566 రెసిడెన్సి బజారులో నుండు నామపల్లి గౌరీశంకరవర్మ అండ్ కో., ఆంధ్రబుక్‌డిపో వారిని మా ఏజంట్లుగా నేర్పరిచినాము. అంగ్రేజి పోస్టు సౌకర్యములు లేనివారు మా ఏజెంట్లకు వ్రాసి పత్రికలు వగైరాలు తెప్పించుకొనవచ్చును.

చందాలవివరము

| | | | | |
|---|---|---|---|---|
| ఆంధ్రదినపత్రిక సంవత్సరచందా | (ఉస్మానియా) | 28-8-0 | కల్దారు | 24-0-0 |
| ,, ఆరుమాసములకు | ,, | 14-4-0 | ,, | 12-0-0 |
| ,, మూడుమాసములకు | ,, | 7-7-0 | ,, | 6-4-0 |
| ,, మాసమునకు | ,, | 2-9-0 | ,, | 2-2-0 |
| ఆంధ్రవారపత్రిక సంవత్సరచందా | ఉస్మానియా | 4-12-0 | ,, | 4-0-0 |

## క్రొత్తసంవత్సరాదిసంచికలు

| | | | |
|---|---|---|---|
| దినపత్రిక చందాదారులకు | 1-0-0 | చందాదారులు కానివారికి | 2-0-0 |
| వారపత్రిక | 1-4-0 | పాతసంచికలు సంచిక 1 | 1-0-0 |

సంచికల నంపుటకు తపాలఖర్చులు ప్రత్యేకము.

## భారతి (సచిత్రమాసపత్రిక)

రంగుల చిత్రపటములు, విద్వాంసులచే వ్రాయబడిన గద్య, పద్య, చారిత్రక, గాన, చిత్రకళాది విషయములను చర్చించు వ్యాసములు, కథలు కలిగి అతిసుందరముగ ప్రకటిత మగుచున్నది.

| | | | | |
|---|---|---|---|---|
| సంవత్సరచందా | ఉస్మానియా | 7-2-0 | కల్దారు | 6-0-0 |
| అర్ధసంవత్సరచందా | ,, | 3-9-0 | ,, | 3-0-0 |
| విడిపత్రిక | ,, | 0-12-0 | ,, | 0-10-0 |

భారతి మొకటి నాలుగు సంపుటములు (1924 సం. మొదలు 1927 సం. వరకు) క్యాలికో బైండు విక్రయమునకు సిద్ధముగ నున్నవి. ఒక్కొక్క సంపుటము (రెండుభాగములు) వెల రు. 9-0-0. వి. పి. చార్జీలు వగైరాలు ప్రత్యేకము.

మేనేజరు, "ఆంధ్రపత్రికాకార్యాలయము" 7, తంబుచెట్టి వీధి, మద్రాసు.

నిజాంరాష్ట్రప్రతినిధి:—నామపల్లి గౌరీశంకరవర్మ అండ్ కో., 566, రెసిడెన్సిబజారు, హైదరాబాదు, దక్కన్.



Price Annas 10 only.
**AMRUTANJAN DEPOT**
**MADRAS & BOMBAY.**



## ఆంధ్రగ్రంథమాల

### 7 తంబుశెట్టివీధి, మద్రాసు.

ఈ గ్రంథమాలయందు విజ్ఞానాభ్యుదయమునకు సాధనములై వివిధవిషయములకు సంబంధించిన గ్రంథములు రెండుమాసముల కొకగ్రంథము వంతున ప్రచురింపబడును.

వెలువడిన గ్రంథములు

1 శతకమంజరి (ప్రథమసంపుటము): వృషాధిప, సర్వేశ్వర, దేవకీనందన, ఒంటిమిట్టరఘువీర, నారాయణ, కాళహస్తీశ్వర, దాశరథి, రంగశాయి, రామతారక, రామచంద్ర శతకములు పది యిందు గలవు. ఒక్కొక్క శతకమునకు పీఠికయు, పాఠభేదములును గలవు. (ఈ శతకములు విడిగను దొరకును.) 1-8-0

2 బసవపురాణము (ద్విపద): పాల్కురికి సోమనాథుడు. అనేక తాళపత్రమాతృకలను పరిశీలించి కూర్చిన మూలము. పాఠభేదములు సూచింపబడినవి. శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు వ్రాసిన విపుల మగు పీఠిక గలదు 3-8-0

3 గాంధిమహాత్ముని బెల్గాము కాంగ్రెసు అధ్యక్షోపన్యాసము 0-2-0

4 ముకుంద (చిన్నవిచిత్రకథ): శ్రీ రాయసం వేంకటశివుడుగారు, యమ్.ఏ.,యల్.టి. 0-8-0

5 హితోపదేశము: ఇది యొక యత్యుత్కృష్టనీతిగ్రంథము. ఇది తొల్లి దాదాపు రెండువేలేండ్లకు ముందు దాక్షిణాత్య పండితుచే సంస్కృతభాషయందు రచియింపబడి పదపడి యనేకభాషల బరివర్తితమై వ్యాప్తిని గన్నది. అనువాదకులు: శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు 1-4-0

6 త్యాగరాజస్వామిచరిత్రము (పద్యకావ్యము): శ్రీ పసుమర్తి కృష్ణమూర్తిశాస్త్రి కృతము. శ్రీరామభక్తాగ్రేసరుడు, గాయకపితామహుడు నగు శ్రీత్యాగరాజుగారి చరిత్ర మిందు సరసముగ వర్ణింపబడినది. సందర్భానుసారముగ త్యాగరాజుగారు రచియించిన కృతులును నిందు చేర్చబడినవి. 0-10-0

7 ధమ్మపదము (వచనము): బౌద్ధమత ధర్మప్రబోధక గ్రంథ మగు 'త్రిపిటకము' న నందలిది. బౌద్ధమతధర్మతత్త్వము లిందు చక్కగా ప్రతిపాదింపబడినవి. అనువాదకులు: శ్రీ కిడాంబి రంగాచార్యులుగారు, యమ్. ఏ., యల్. టి. 0-10-0

8 భీష్ముడు (అయిదంకముల నాటకము): నార్వేదేశపు కవిశిఖామణి యగు ఇబ్సెను గారి బ్రాండు అను నాటకమున కనువాదము. అనువాదకులు శ్రీ పొణకా పిచ్చిరెడ్డిగారు. బి. యే. (ఆనర్సు) 1-0-0

9 విద్యానగరచరిత్రము: శ్రీ కుందూరి ఈశ్వరదత్తుగారు, బి. యే. శ్రీకృష్ణదేవరాయ సామ్రాజ్యకీర్తికీర్తి నగు విద్యానగరము (హంపిశిథిలములు) యొక్క ప్రాచీనచరిత్రము, ప్రకృతశీర్ణస్థితియు నిందు వర్ణితము లైనవి. 1-8-0

10, 'ఆత్మకథ' ప్రథమసంపుటము. శ్రీగాంధిమహాత్ములవారి స్వీయచరిత్రము. ఇందు వారి సత్యాన్వేషణ-సత్యప్రయోగముల కథ వివరింపబడినది. ఆదర్శజీవనమును ప్రదర్శించునది. మూలమునుండి శ్రీశతావధాని వేలూరు శివరామశాస్త్రిగారిచే ననువదింపబడినది. 400 కు పైగ పుటలు గలవు. చక్కనియచ్చు, కేవరు. 1-0-0

కాశీనాథుని నాగేశ్వరరావు, వ్యవస్థాపకుడు

నిజాంరాష్ట్రప్రతినిధి — నామపల్లి గౌరీశంకరవర్మ అండ్ కో., 566, రెసిడెన్సిబజారు, హైదరాబాదు, దక్కన్.










# పుస్సీఫుట్ జాన్సన్

మద్యపాననిషేధ ప్రచారకులలో నగ్రస్థానమునలంకరించి విశ్వవిఖ్యాతి గాంచినట్టి మిస్టరు జాన్సన్ (పుస్సీఫుట్ జాన్సన్) గారు ప్రపంచపర్యటనము మూడవ పర్యాయము ముగించి స్వదేశము అనగా యునైటెడ్ స్టేట్సునకు జనినసందర్భమున అయోవా విశ్వకళాశాలలో ఆర్థిక రాజకీయ శాస్త్రాధ్యాపకులగు డా॥ ఎ. ధీంగ్రాలోసుగారు సంభాషింపగా వెలిబుచ్చిన అభిప్రాయముల కొన్నిటిని ఆంధ్రపత్రికాపాఠకమహాశయులకు నివేదించుచున్నాను.

హైందవులకు సర్వస్వాతంత్ర్యము, స్వపరిపాలనాధికారము అనుగ్రహించునో అచిరకాలములోనే మద్యపానదురాచారము నిర్మూలింపబడగలదు. అమెరికనులకంటె హైందవులకు మద్యపాననిషేధముపై అధికాభిమానముగలదు.

నేను హిందూదేశములో సంచారమొనర్చుచుండగా బ్రిటిష్ప్రభుత్వ నియమితులగు గూఢచారులెందరో నా వెనువెంట నడుచుచునేయుండిరి. మద్యపాననిషేధ ప్రచారమును సూచించునట్టి పతాకమొకటి నేనెగురవేయుచుండ వారది చూచి సహింపజాలక పోయిరి. నేనంతట ఇదియే 'మద్యపాననిర్మూలనోద్యమసూచక పతాక'మని నొక్కిపలికితిని. ఆంగ్లేయులుకూడా యిట్టి ధ్వజమును ప్రతిష్ఠింపగలిగినచో నాకెంతో సంతసముకలుగగలదు.

మద్యపాననిషేధశాసనము నిర్మింపబడక పూర్వము అమెరికాలో మధుపానదురాచారముగూర్చి శతాబ్దములకొలది ప్రచారమొనర్చగలిగినను ప్రయోజనమేమియు లేకపోయెను. అమెరికను లిది గుర్తెరిగి యీ దురాచార విషవృక్షమును బ్రూకటివేళ్లతోసహా విధ్వంసమొనర్చుటకు సంకల్పించుకొని తదనుగుణ్యముగా ప్రతినిధుల ప్రేరేపించి శాసనముల నిర్మింపగలిగిరి. మద్యములభించునంతవఱకు మధుపానాసక్తి హెచ్చుచునేయుండును. కల్లుముండిననేగదా యీగలుముసురుట? ఏ దురాచారమునైనను రూపుమాపుటకు తన్నిషేధనిర్మూలనములే అవశ్యాచరణీయములు గాని సంస్కరించినమాత్రమున ప్రయోజనముండజాలదు. ప్రభుత్వములు లైసెన్సుపద్ధతులు, రక్షణపద్ధతులు అవలంబించునంతకాలము మధుపానాభిలాషులు మధుసేవ యొనర్చుచునేయుందురు. సురాపానదురాచారము నిర్మూలింపవలెనన్న సురాపానము లభింపకుండగనే చేయుట ముఖ్యకర్తవ్యము. విద్యావ్యాపారపద్ధతులలో ఏవో కొన్ని మార్పులు చేసినంతమాత్రముననే సంపూర్ణనిషేధము కొనసాగనేరదు. లోకములో నెల్ల న్యూయార్కునగరమున దుర్మార్గులెక్కువగనుందురనియు దుర్వ్యాపారములు హెచ్చనియు, కేవలము భూలోకనరకకూపమే యనియు యూరోపియనుల అభిప్రాయము. నిజమునకు లండను, పారిస్, మ్యూనిచ్ నగరములతో న్యూయార్కునగరమును పోల్చిచూచిన అద్యది స్వర్గతుల్యమనియే చెప్పవచ్చును.

న్యూయార్కులోకంటె యీపట్టణములలో నేకేట త్రాగుడు, వ్యభిచారము, మొదలగు దుర్వ్యసనములవలననేమి, దుష్పహాయకు దారిద్ర్యమువలననేమి ఎక్కువ ఘోరకార్యములు రాక్షసకృత్యములు చేయుటయు అకారణమున అరెస్టుల పాలగుటయు సంభవించును. న్యూయార్కులోకంటె లండనునగరములో మైమరచి తప్పత్రాగి అరెస్టు కాబడువారిసంఖ్య మూడు మూడున్నరెట్లు ఎక్కువగానుండును.

ఒకలండనునగరముననే 14000 పీకదుకాణములు గలవు. పారిస్ నగర వాస్తవ్యులు జూలియస్ సీజర్ కాలమునాటి నుండి సారాయి బ్రాందీలకు బదులుగా ద్రాక్షరసమును సేవింపనారంభించిరి. కాని మధుపానాసక్తి యింకను హెచ్చుగనే యున్నది. జనసంఖ్యయందలి తారతమ్యములబట్టి పోల్చిచూడ న్యూయార్కులోకంటె పారిస్పట్టణములో మధుపానకారణముచే నిర్బంధితులగువారిసంఖ్య రెండుమూడురెట్లు ఎక్కువగానుండును.

ఫ్రాన్సుదేశములో 1924 వ సంవత్సరమున 15600 మంది త్రాగుబోతులు శిక్షింపబడిరి. 1924 లో ఫ్రాన్సుదేశమున 8800 ఆత్మహత్యలు జరిగియుండెను. వీనిలో 1000 హత్యలు తెగత్రాగుటవలననే సంభవించెను. బవేరియాకు ముఖ్యపట్టణమగు మ్యూనిచ్లో జర్మనులు బీరును పీపాలకొలది త్రాగుచుందురు. ఈ త్రాగుబోతులు పౌరులకు కంటకప్రాయులుగ నున్నారు. మ్యూనిచ్పట్టణము బీర్వ్యాపారమునకు కేంద్రస్థానము, ఘోరనరకకూపము. ఇట్లే ఇతర యూరోపియన్ పట్టణములుకూడ నున్నవి. జనసంఖ్యయందలి తారతమ్యమును బట్టిచూడ న్యూయార్కులోకంటె యూరోపునందలి స్టాక్హోమ్ పట్టణములో 9,10 రెట్లెక్కువగను, అస్లో (క్రిస్టియానా) నగరములో 80 రెట్లెక్కువగను, లివర్పూల్, ఎడింబరో, గ్లాస్గో పట్టణములలో 8 మొదలు 7 రెట్లు ఎక్కువగను త్రాగుబోతులు అమానుషకృత్యములొనర్చి అరెస్టుకాబడుచుందురు.

విద్య మిగుల ప్రయోజనకారియే. నాగరకతగల దేశములన్నిటిలో విద్య సర్వజనవ్యాప్తము కావలసినదే. కాని ప్రభుత్వములు కల్లు, సారాయి, బ్రాందీ విస్కీ మొదలగు మత్తుపదార్థములు మాదకద్రవ్యముల యుత్పత్తి విక్రయము లొనర్చుటకై లైసెన్సులు, రక్షణపద్ధతులు ఏర్పఱచునంతకాలము ప్రజలు ఆ కల్లు సారాయి మొదలగువానిని సేవింపుదురనియే ఆవిద్య ప్రోత్సహించుచుండునని నా అభిప్రాయము. ప్రజలను సన్మార్గులుగ నొనర్చునది విద్యయే. విద్య దుష్పథముల బట్టించరాదు. దేహ మనో బుద్ధుల వికసింపజేయునదియే సక్రమమగు విద్య. విద్య ఆత్మహాని, బుద్ధిచాంచల్యము, మనఃక్లేశము కలిగించునదిగా నుండరాదు. విద్య తృష్ణాపాన వ్యభిచారాదులకు నదిగ నుండక బుద్ధివికాసమును నిర్మలస్వభావమును దోహదమొనర్చునట్టిదిగ నుండవలయు. పూర్వముకంటె త్రాగుడు కొంతవఱకు తగ్గుటచేతనే లోకములో ననేకదుర్మార్గములు దుర్వ్యాపారములు అంతరింపగలైను. పందెములు, జూదములు, వ్యభిచారము, చౌర్యము మొదలగు దుర్వ్యాపారముల వశింపజేయునిమిత్తము అనేక దేశములలో శాసనములు నిర్మింపబడియున్నవి. ఈ వ్యసనములన్నియు శాసనముల మూలముననే నిర్మూలము కాగలవుగాని సంస్కరణములు ప్రవేశపెట్టుటవలనగాని, పన్నులభారము హెచ్చించుటవలనగాని, ప్రచారమువలనగాని అదృశ్యము కాజాలవు.

ఇంగ్లండు, వేల్సు దేశములలో శతాబ్దములకొలది బానిసవ్యాపారము జరుగుచునే వచ్చెను. ఈ దాసవ్యాపారము దుర్వ్యాప్తి తుదకు నిషేధశాసనముల ప్రయోగించుట చేతనే అంతరింపగలైను — క్రైస్తవ సంఘములుకూడా యీవ్యాపారమును రెండు, రెండున్నర శతాబ్దములు ప్రోత్సహించుచు, ఆమోదించుచువచ్చెను. పార్లమెంటులుకూడా బానిసవ్యాపార సంరక్షణార్థము కొన్ని సూత్రములను, సవరణలను ప్రతిపాదించి ఆమోదించుచువచ్చెను. ఇరువు రాంగ్లప్రభువులుకూడా యీ బానిసవ్యాపార సంఘములలో భాగస్వాములుగ నుండిరనిన ఆశ్చర్యముగనుండవచ్చును. సర్ జాన్ హాకిన్సు అనునతడు యీబానిసవణిక్శ్రేష్ఠులలో నగ్రగణ్యుడు. అతడు తన యీవ్యాపారమునందెటిని జీసస్ అను నామముగల నావ సహాయమున నిర్వహించుచువచ్చెను. అతడు ఆఫ్రికను గ్రామముల దహనమొనర్చియు, కొల్లగొట్టియు, అందలి ప్రజలను వధించియు, వివిధముల హింసించియు అపహరించిన ప్రజలను పశువులవలె విక్రయించి విశేషధన మార్జించెను. అట్టి యీమహాపాపునకు ఎలిజబెత్ రాణి 'సర్' అను బిరుదము బహూకరించి తన సంతసము వెలిబుచ్చెను. ఎట్టివానికెట్టి బిరుద మొసంగెనో చూడుడు! సర్ జాన్ హాకిన్సు మొదలిడిన యీబానిసవ్యాపారము ఆంగ్లదేశీయ క్రైస్తవులు రెండున్నరశతాబ్దములు అవిచ్ఛిన్నముగా జరుపుచుండిరి. తుదకు వారికే బుద్ధివచ్చి యీ వ్యాపారవిషవృక్షమును సమూలముగ నాశనమొనర్చిరి. ఈ బానిసవ్యాపారమును నిషేధించునట్టి శాసనములే యీపాటికి నిర్మింపబడకుండిన యింగ్లండు తనపాలనకు లోబడిన విదేశములన్నింటియందును యీవ్యాపారమును నిరంతరాయముగ సాగించియుండెడిదే. ఇప్పటికికూడా యింగ్లండులో బీరువ్యాపారస్థులు విస్కీ వర్తక ప్రముఖులు మద్యపాననిషేధమునకు ప్రతికూలముగనే యుండి అనేక అంతరాయముల కల్పించుచున్నారు. బానిసవ్యాపారులవలెనే వీరును కొంతకాలమునకైన తెలివితెచ్చుకొని తమ వ్యాపారమును కట్టిపెట్టగలరు. ఆంగ్లేయులలో బుద్ధిమంతులగువారు మద్యపానమువలన కలుగు ప్రమాదములను గుర్తెరుగక పోలేదు. స్కాట్లాండులోని యూమర్ ప్రభువు మద్యపానవ్యాపారమునే నిర్వహించుచుండును. ఆయనక్రింద విస్కీబట్టీలు ఎన్నియో కలవు కాని ఆయన ఎస్టేటులోకూడా త్రము విస్కీ విక్రయించునట్టి అంగడులను ఏమాత్రము పెట్టుకొననివ్వడు. అట్టి అంగడులవలన కలుగుహాని ఎట్టిదో ఆయనకు బాగుగా తెలియును. జార్జిచక్రవర్తికూడా తనకు స్వంతమగు సాండ్రింగుహామ్ ప్రాంతమున సారాయి, విస్కీలమ్ము అంగడుల పెట్టుకొననివ్వడు. మద్యపాన దురాచారము పోగొట్టుటకు మద్యపాన నిషేధక శాసననిర్మాణమే సక్రమపద్ధతి. యునైటెడ్ స్టేట్సులో మద్యపాననిషేధక శాసనము అమలులోనికి రాకపూర్వము 8000000000000 (మూడులక్షలకోట్లు) డాలర్ల మద్యసారము విక్రయించునట్టి అంగడుల పాలగుచుండెను. ఇప్పటికిని యింకా మద్యపాననిషేధక శాసనములో లేకుండినయెడల జనసంఖ్యలో గలయభివృద్ధిని బట్టియు నవనాగరకతా వ్యామోహమువలనను కనీసము 8, 9 లక్షల కోట్ల డాలర్లు ఏటేట అంగడుల పాలగుచుండెడివే! ఇప్పటికింకను యునైటెడ్ స్టేట్సులో మద్యపాన నిషేధకపద్ధతి సక్రమమార్గమున నడుచుచుండలేదనుట కొంతవఱకు నిజమే. ఐనను తదితరదేశములలో త్రొక్కబడుచున్న మార్గములకంటె మా దేశమునందలి పద్ధతి విశేషఫలప్రదముగా నున్నదనుట రూఢి.

ఇప్పటికింకను యునైటెడ్ స్టేట్సులో ఏటేట ఒకలక్ష కోటిడాలర్లు (శాసనము నతిక్రమించి దొంగతనముగ నమ్ముచున్న కారణముచేత) త్రాగుడు క్రిందపాడగుచున్నదని కొందఱి అభిప్రాయము. పోనీ అప్పటికైనను ఎనిమిది, తొమ్మిది లక్షలకోట్ల డాలర్ల సొమ్ము సద్వ్యయము నగుచున్నదని సంతోషింపవచ్చునుగదా! ఈ మద్యపాన నిషేధక సూత్రమువలన సాంఘికముగను ఆర్థికముగను మహోపకారము కలుగుచున్నదని ప్రెసిడెంటు హూవరుగారు అభిప్రాయపడుచున్నారు. మద్యపాననిషేధము వలన యునైటెడ్ స్టేట్సుయొక్క పరిస్థితులు పూర్వముకంటె అనేకరెట్లు చక్కబడెననుట నిజము.

త్రాగుబోతు లెక్కువగా మద్యపాననిషేధక శాసనముల నిరసించి యుల్లంఘింపజూతురు. దురహంకార ప్రేరితులగువారు యిట్టి శాసనములు ప్రజాస్వాతంత్ర్యమును నిరోధించుచున్నవని ఆందోళన చేయుచుందురు కాని అదృష్టవశమున యీ దురహంకార ప్రేరితులకంటె సంఘక్షేమాభిలాషులే అధికముగా నున్నారు. మద్యపాన నిషేధక శాసనముల వలన ఆర్థికముగ నైతికముగ నెంతయో అభివృద్ధి గన్పట్టుచున్నది.

పగలంతయు చెమటోడ్చి పనిచేసి కూలిడబ్బులు మూటకట్టుకొని పోవుచుండగా త్రోవప్రక్కన చిత్రవిచిత్రముగ నలంకరింపబడి ఆకర్షించుచుండు సారాయి అంగడులమీది కోరూరగా ఆనాలుగు డబ్బులు సమర్పించుకొని రిక్తహస్తములతో సొక్కుచు సోలుచు పోయి దురవస్థల పడుటకు మారుగా మద్యపాన నిషేధక శాసనప్రయోగమువలన కల్లుముండలు కంటబడని కారణమున ఆ కూలిడబ్బులు నాలుగుయింటికి తీసికొనిపోయి కావలసిన కూడుగుడ్డ తెచ్చుకొని హాయిగ ఎండన్లో జీవనము చేయగల్గుచున్నారు.

వెనుకటికంటె కూలివారియిండ్లు వారిగుడ్డలు గృహోపకరణములు మరిగను శుభ్రముగ నుండుట సంభవించుచున్నది. స్వాత్మాభివృద్ధికి స్వసంరక్షణమునకు స్వశరీరపోషణమునకు పాటుపడుటకు కూడా అవకాశమేర్పడుచున్నది. మద్యపాననిషేధక శాసన నిర్మాణపూర్వముకంటె ప్రకృతకాలమున ఉన్నత విద్యాలయములందును కళాశాలలందు నుండెడి విద్యార్థులసంఖ్య రెండు మూడు రెట్లు ఎక్కువయ్యెనని దృఢపడుచున్నది. తలిదండ్రులు తమ ధనమును సారాయి విస్కీలకు కొల్లబెట్టుటకు మారుగా కూడబెట్టుకొని దానితో తమ పిల్లలకు చదువుసాములు చెప్పింపగల్గుచున్నారు. సామాన్యులు పేదలు హాయిగా జీవనము చేయగల్గుచున్నారు. కళాశాల విద్యార్థులలో కొందఱు మద్యపాన నిషేధక శాసనము నతిక్రమించి గందరగోళము చేయజూచుట వాస్తవమే కాని అది చమత్కారముగ వ్యక్తిస్వాతంత్ర్యమును వెల్లడించుటకే యని భావింపవలెను. వినను వెనుకటిరోజులలోకంటె యిప్పుడు కళాశాల విద్యార్థులలో త్రాగుడు చాలవఱకు పూర్తిగా తగ్గినదనియే చెప్పగలను. పది యేండ్లక్రిందట ఏల్ యూనివర్సిటీకి సంబంధించిన క్రీడారంగములకు తెలుచు వెళ్లుచుండెడివాడను. విద్యార్థులు ప్రేక్షకులు తెగత్రాగి గుంపులుగుంపులుగ వచ్చుచుండెడివారు. ఇప్పుడన్నను అట్టివిపరీతస్థితి కానము. పదేండ్లలో నెట్టి మార్పుకలిగెనో చూడుము. మద్యపాన నిషేధమునకు ప్రతికూలముగ కొందఱు ప్రచారము చేయుచునేయున్నారు. కాని అట్టివారి సంఖ్య అత్యల్పము. సారాయి విస్కీలు దొంగతనముగ నుత్పత్తిచేయువారు విక్రయించువారు కొన్నికొన్ని పత్రికల అట్టి ప్రచారకులకు ధనవాక్సహాయము లొసగి ప్రేరేపించుచుండును. యునైటెడ్ స్టేట్సులో ఈ విశేషపద్ధతి నిర్విఘ్నముగ కొనసాగెనేని ప్రపంచమంతయు నీ పద్ధతినే యవలంబించి తీరవలెనది భయపెట్టము వీరిని యావహించి చిందులు త్రొక్కించుచున్నది. అయినను త్రాగుడు చాలవఱకు క్షీణించినదనియే రూఢిపరచగలను. నాగరక ప్రపంచమంతయు మద్యపాన దురాచారమును నిరసించుచునే యున్నది. నిషేధోద్యమము ప్రపంచమంతటిలో యునైటెడ్ స్టేట్సులో విశేషముగా ప్రబలియున్నది. ఫిన్లాండు డెన్మార్కు లిథూనియా బల్గేరియావంటి యూరోపియన్ దేశములు యునైటెడ్ స్టేట్సుయొక్క అడుగుజాడల ననుసరించుచున్నది. నాగరక ప్రపంచములో తీరిన స్పెయిన్ పోర్చుగల్, గ్రీసుదేశములలో యింకను సురాపానదురాచారమును రూపుమాపునట్టి శాసనము లేమాత్రము నిర్మింపబడకుండుట సిగ్గుచేటు. మద్యపాననిషేధోద్యమము నిర్విఘ్నముగ కొనసాగించు విషయములో యునైటెడ్ స్టేట్సు వెనుకంజవేయునను మాట నట్టేకల్ల. ప్రజోపయోగకరములగు యుద్యమములు వ్యాపింపజేయుటలో అమెరికా యెన్నడు వెనుకడుగు వేసియుండలేదు. మద్యపాననిషేధమును ప్రభుత్వమువా రంగీకరించి యిదివఱకే శాసనముల నిర్మించి అమలునకు తెచ్చియున్నారు. మా పతాకము నిరంతరాయముగ నెగరుచున్నంతవఱకు యీ శాసనము రద్దుచేయబడదు. అమెరికా ప్రతినిమయమునకు దినదినాభివృద్ధి గాంచుచునే యున్నది. ఆ జనపదమూడదబోదు. ప్రపంచమంతయు అమెరికానే అనుకరించుచున్నది. మద్యపాననిషేధ ప్రచారము కావించుటలో నేనెన్నియో ఆగచాట్లపడితిని. 1919వ సంవత్సరమున లండను నగరమునందలి ఓవర్సీస్ క్లబ్బువారు మద్యపాననిషేధముగూర్చి యుపన్యసింప నన్నాహ్వానించిరి. నేను ఎసెక్సుహాల్ మెట్లనెక్కుచుండగా కింగ్సు కళాశాల విద్యార్థులును, సర్వకళాశాల విద్యార్థులును గుంపులుగుంపులుగగూడి పిండితో నింపిన సంచులను నాపైవర్షమువలె కురిపించిరి. ఎట్లో మందిరమున ప్రవేశించితిని. అంతటితో..

